ప్రథమ ముద్రణ :
1973

ప్రతులు :
1000

ప్రతులకు :
ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్
సికింద్రాబాద్.

సుఖేలా నికేతన్
హైదరాబాద్.

కవిరాజ సాహితీ సదనం
8-3-214/15, శ్రీనివాసా కాలనీ,
హైదరాబాద్-38.

వెల: రు॥ 2-50 పై.

ముద్రణ :
ప్రగతి ఆర్ట్ ప్రింటర్స్
హైదరాబాద్-4.

# Tripuraneni Subba Rao-A Profile

There are some who possess the facts of experience : others, sheer imagination. Those who possess facts of experience as well as imagination will become the best writers.

Mr. Tripuraneni Subba Rao belongs to the latter category. The surname "Tripuraneni" has an interesting historical background.

Sambhu, the Commander-in-Chief of Prataparudra Deva who was a very famous ruler in Kakatiya dynasty won a battle against Malaks. While the battle was on, he washed his sword adventurously in the pool of blood of the enemies.

Then Prataparudra Deva admired the indomitable courage and undaunted valour of his Commander-in-Chief. Soon after the victory, Prataparudra Deva glorified him with the highest echelons of honour as 'Tripura Sambhu'.

Henceforth the surname "Tripuraneni" adorned this family as a sign of valour and heroism.

During that terrible battle, the Malaks escaped death by knowing the direction of the 'Turai' - a flower like feather in the turban of the Commander-in-Chief. Thus the 'Gothram' of Tripuraneni family as 'puvvada' betokens the crest of the crown of their ancestor Sambhu Dalavai who routed the Malaks.

## IN SUTA ASHRAM

Tripuraneni Subba Rao belongs to this family of great tradition and culture. Born in 1929, he took his B.A.

degree from Andhra University in 1951. Eversince his childhood, he has been a passionate lover of Telugu literature.

Influenced by one of the great revolutionary poets, Mr. Tripuraneni Ramaswamy Choudary, he wrapped himself into the beauties and subtleties of Telugu Prabhandhas in "Suta Ashram" where his favourite subjects literature, history, philosophy and philology were discussed in conferences and seminars conducted by Mr. Ramaswamy Choudary.

These discussions made a deep impact on the writings of Mr. Subba Rao. He was nurtured by Kavi Raju during an age when literary criticism was in its early stages.

He has also been encouraged by Mr. Tripuraneni Gopichand whose writings have enriched the Telugu literature.

## LITERARY WORKS

Tripuraneni Subba Rao is not only a popular writer but also a reputed research scholar. His books entitled 'Andhrabhyudayam' (Literary essays) 'Kaviraju Jeevitam- - Sahityam', 'Gopichand Jeevita Charitra', Profile of Hari Purushottam a poet and a noteworthy playwright, 'Navyandhra Kavi Brahma Yetukuri Venkata Narasaiah Jeevitham -- Sahityam are the latest contributions to the Telugu literature.

"Kavi Raju Lekhalu" is another work marking another milestone in the field of research. His "Sahitya Vyasalu' and brief biographical sketches published in contemporary dailies attracted the attention of many poets and set them thinking.

His present work underway includes fifty more biographies of modern Telugu poets and Pandits.

## A DISTINGUISHED BIOGRAPHER

Among his works "Kaviraju Jeevitam—Sahityam" and "Gopichand Jeevita Charitra" are *PIECE DE RESISTENCE* and thought provoking. Andhra Pradesh Sahitya Academy sanctioned an amount of Rs. 1,000 as grant during 1969 to the author to bring out the biography of "Navyandhra Kavi Brahma", Yetukuri Venkata Narasaiah.

The function of a biography is the truthful transmission of personality. The biographer is both a scientist and an artist.

A. C. Benson in his eassy on 'The Art of the Biographer' has stated "The biographer must have a relentless faculty and microscopic observation, he must have patience, energy and research, he must have a power of omission and selection and lastly he must have an extreme veraciousness which does not pay any particular heed to sentiment or romance".

Mr. Subba Rao has all qualities in him that are required for a biographer. He is a humanist in delineation of characters.

The part played by a good biography in rejuvenating and inspiring a nation in its onward march cannot be under estimated.

There is, therefore, an urgent and imperative need for the production of first rate biographies of eminent poets and reputed authors in Telugu. These biographies should deal with the details of their day-to-day lives, their deeds and attainments, their transcendental genius and skill.

## GOOD CRITIC

Besides being a prolific writer of prose and biographies, Mr. Subba Rao is a good critic. Anatole France said "The good critic is he who narrates the adventures

his soul among master pieces". This is true in the case of Mr. Subba Rao, when referred to as a critic.

In his expositions, we find critical appreciation rather than attack. He likes to praise excellence wherever he finds it, but he limits his criticism to the poet's work rather than to his personality.

His method is impressionistic, aphoristic and honours his subject by quoting from them liberally. He is not interested in thrusting his ideas on his readers, for he is aware that literary ideas are, at best, informed opinions -- they are useful as agents of liberal thinking, not as purveyors of dynamic beliefs.

His writings grip the readers with enrapturing interest.

On the knotty subject of poetic diction, as well as biographic memoirs, Mr. Subba Rao excels others. He recognises that biography is one of the most curious and amusing arts in the appreciation of lives and works of greatmen either living or dead because different languages of the same nation have different tastes at different times.

**VIMARSAKA RATNA**

Mahakavisekhara, Satavadhani, Chitrakavita Praveena, Kavi Simha, Ex-Poet-Laureate of Gadwal, Brahmasri Pokuri Kasipatyavadhanulu, the President of the Nagarjuna Sahiti Samakhya of Macherla in Guntur District honoured Mr. Subba Rao with a title "Vimarsaka Ratna" on 31st Oct. 1970 in recognition of his out standing ability in writing the biographies of great men.

Mr. Tripuraneni Subba Rao has created niche for himself as one of the distinguished biographers in modern Telugu literature.

*(By Courtesy of The Deccan Chronicle)*

# అమృతాభినందన

విమర్శకరత్న శ్రీ త్రిపురనేని సుబ్బారావుగారి జీవితము విశిష్టమైనది. కవిరాజు శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరిగారి అనుంగు శిష్యులు సుబ్బారావుగారు వీరు అనేక సాహిత్య వ్యాసాలు రచించి, అనేక మంది సాహిత్య స్రష్టల జీవితాల అంతరాంతరాలలోకి వెళ్ళి, మరుగున పడిన జీవిత విశేష మాణిక్యాలను వెలుగులోకి తెచ్చిన సత్యాన్వేషి. శ్రీయుతులు నార్ల వెంకటేశ్వరరావు, తాపీ ధర్మారావు, త్రిపురనేని గోపీచంద్, దివాకర్ల వెంకటావధాని, పాటిబండ మాధవ శర్మ, పింగళి లక్ష్మీ కాంతం, ఆచంట జానకీరామ్, కొండూరు వీర రాఘవాచార్యులు, దుగ్గిరాల బలరామకృష్ణయ్య మొదలైన ప్రముఖ విమర్శక సాహిత్య వేత్తల అభినందనలు అందుకొన్న వారు శ్రీయుతులు గుఱ్ఱం జాషువా, తుమ్మల సీతారామమూర్తి, కాటూరి వేంకటేశ్వరరావు, పోకూరి కాశీపతి, విశ్వనాధ సత్యనారాయణ, బోయి భీమన్న, సి. నారాయణరెడ్డి, సి. వి సుబ్బన్న ప్రభృత కవిపుంగవుల ప్రశంసలకు పాత్రులైనారు. సూతాశ్రమ వాతావరణంలో పెరిగి, జీవితాన్ని మలచుకొన్నా, తత్త్వజిజ్ఞాసలో, సత్యాన్వేషణలో సుబ్బారావు గారు తమకు జన్మతః లభించిన మౌలికతను కాపాడుకున్నారు.

త్రిపురనేని వంశం అతి ప్రాచీనమైనది. తెలుగు దేశంలో వీర శైవం తల ఎత్తడానికి పూర్వమే ఉన్నట్లు కన్పిస్తున్నది. ఇదే విధంగా కొతవరం, అంగలూరు వంటి గ్రామాల చరిత్ర దాదాపు 2000 సంవత్సరాల నాటిది. బౌద్ధయుగంతో ముడిపడి యున్నది.

సుబ్బారావు గారు తత్వాన్వేషిగా తమ రచనలన్నిట గోచరిస్తారు. వారి జీవిత విశేషాలు సంగ్రహంగానైనా ఆంధ్రులకు తెలియజేస్తూ ఈ 'జీవిత చిత్రణ' రచించిన మంత్రి ప్రెగడ వీరభద్రమూర్తి గారు అభినంద నీయులు. సుప్రసిద్ధ కథకులు, నవలా రచయిత, కవి అయిన శ్రీ వీరభద్రమూర్తి జీవిత చిత్రణ చేయడంలో విశిష్టత లేక పోలేదు గాని, శ్రీ సుబ్బారావు గారే తాము పుట్టినదాదిగా షష్టిపూర్తి వరకైనా రానున్న సంవత్సరాలలో బృహత్తరమైన 'ఆత్మకథ' వ్రాయడం అన్ని విధాలా సమంజసమని భావిస్తున్నాను. దీనివల్ల సుబ్బారావు గారు రచించిన ఇతర జీవిత చరిత్రలకు, స్వకీయమైన ఆత్మకథకు ఒక విధమైన పొంతన సమకూరి, సుబ్బారావు గారికి ఒకానొక విశిష్ట వ్యక్తిత్వం సమకూరగలదు. దీనివల్ల అనేక మంది కవి, పండిత, విమర్శక, పరిశోధక శిఖామణులతో అవినాభావ సంబంధం కలిగియున్న సుబ్బారావు గారి జీవితం ఆంధ్ర సాహిత్య చరిత్రలో నూతన స్వరూపం దాల్చగలదు. సుబ్బారావు గారి జీవిత చిత్రణ రచించిన శ్రీ మంత్రి ప్రెగడ వారికి నా శుభాకాంక్షలు.

శ్రీ సుబ్బారావు గారు తమ 'ఆత్మకథ' చిత్రణకు రానున్న దీపావళి ప్రారంభదినమై సాహిత్యంలో దివ్యతారక దీపావళిని వెలిగించు గాక!

అమృతాభినందనలతో
వాఙ్మయ మహాధ్యక్ష
**వడ్లమూడి గోపాల కృష్ణయ్య**
కళా-ప్రపూర్ణ
జాయింట్ డైరెక్టర్
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఓరియంటల్
మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ అండ్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్.

హైదరాబాద్
26-9-1973

# జీవిత చరిత్ర రచనా సంప్రదాయం

శ్రీ మంత్రి ప్రెగడ వీరభద్రమూర్తి గారు రచించిన, "త్రిపుర నేని సుబ్బారావు జీవిత చిత్రణ" చదివి ఆనందించాను. కవిరాజు శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరిగారి జీవిత చరిత్రను, కవిబ్రహ్మ శ్రీ ఏటుకూరి వేంకటనరసయ్యగారి జీవిత చరిత్రను విమర్శక రత్న శ్రీ త్రిపురనేని సుబ్బారావు గారు వ్రాయడం, వారి జీవిత చరిత్రను, కవితా విశారద శ్రీ మంత్రి ప్రెగడ వీరభద్రమూర్తి గారు వ్రాయడం చూస్తే, ఇదేదో జీవిత చరిత్ర రచనా సంప్రదాయ మొకటి కొత్తగా స్థాపిత మైనట్టుగా స్ఫురిస్తున్నది నాకు.

ఆంధ్ర సాహితీనందనంలో జీవిత చరిత్ర సుమాలు వికసించడమే తక్కువ. అందులో, ఒక తెలుగు రచయిత పట్ల మరో తెలుగు రచయిత సుముఖుడై, అతని రచనా శక్తికి వశ్యుడై, నిరపేక్షంగా కలం కదపడం మరీ అరుదు. ఆ లోటు తీర్చడానికి, ఈ సంప్రదాయం వెలిస్తే అంత కన్నా కావలసిందేముంటుంది?

శ్రీ మంత్రిప్రెగడ వీరభద్రమూర్తి గారు బహుగ్రంథ రచయితలు. ఈ జీవిత చరిత్ర వ్రాయడంలో ఆయన ఏర్పరచుకున్న విషయ విభాగ ప్రణాళిక బాగున్నది. సుబ్బారావు గారి వంశపౌరాతన్యమూ, బాల్యమూ, విద్యా జీవనమూ, రచనా వ్యాసంగమూ, ఎక్కడకక్కడ సులభరీతిలో హాయిగా సాగింది. ఎక్కడా దురవగాహన లేదు. రచనకు తోడుగా, వివరణాత్మకంగా అక్కడక్కడా చిత్ర పటాలు జోడించడంలో నేర్పు కనిపిస్తున్నది.

ఇకముందు జీవిత చరిత్రలు విరివిగా వెలువడడానికి, ఈ గ్రంథం ఆంధ్ర పాఠకలోకానికి స్ఫూర్తినిచ్చేదిగా ఉండాలని ఆశిస్తున్నాను; అటువంటి ప్రయత్నానికి కారకులైన రచయితను అభినందిస్తున్నాను.

హైదరాబాద్
30-9-1973

నాయని కృష్ణ కుమారి.

# చారిత్రక సత్యాన్వేషి

విమర్శకరత్న శ్రీ త్రిపురనేని సుబ్బారావుగారిని చాలకాలము నుండి నే నెరుగుదును. అయన మా గర్తపుర మండల కూచిపూడివాసి. 1956 వ సం. నుండి ఆంధ్రప్రదేశ్ సచివాలయములో ఉద్యోగము చేయుచూ, రచయితగా ప్రకాశించినారు. 'Duty first, pleasure next' అను నమ్మకముతో ఆయన వ్యవహరించెదరు. సర్ విలియం జోన్సు, కలనల్ కాలెన్ మెకంజీ, సి. పి. బ్రౌను, శ్రీ జయంతి రామయ్య పంతులు, శ్రీ కె. వి. లక్ష్మణరావు, శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ మున్నగు విద్వాంసుల భంగి, ఆయన ఉద్యోగములోనుండికూడ, అనేక జీవితచరిత్రలు వ్రాసి, లాంగ్ ఫెలో సూక్తిని- "Lives of greatmen will give us sublime of thoughts" జ్ఞప్తికితెచ్చి, ఆంధ్రభాషకు మహోపకార మొనర్చినారు.

డైరీలు, లేఖలు పరిశోధించి, వీరేశలింగం పంతులుగారు కవుల చరిత్రలు వ్రాసినట్లుగా, సుబ్బారావుగారు కవిరాజులేఖలు-డైరీలు అత్యధిక శ్రమతో పరిశోధించి లోకమున కందజేసినారు.

నిరంతర పరిశోధకులైన శ్రీ సుబ్బారావుగారి 'జీవిత చిత్రణ' కవితా విశారద శ్రీ మంత్రిప్రెగడ వీరభద్ర మూర్తిగారి దివ్యహస్తమున నేటికి వెలుగులోనికి రావడం శుభావహము.

నేనూ, సుబ్బారావుగారు ఒకే విధముగా పరిశోధకులమే. మాబోటి చరిత్రకారుల కందని చారిత్రక సత్యములు- త్రిపురనేని వంశోత్పత్తి,

శంభుదశవాయి విషయము, పువ్వాడ గోత్రమును గురించి, బహుశః, "మెకంజీ కైఫియతు"ల నుండి సేకరించి యుండవచ్చును. "I would rather discover one scientific truth than become a king of Persia" అని ఒక రచయిత వ్రాసినాడు. రాజగుటకంటే, చారిత్రిక, విజ్ఞానశాస్త్ర సత్యముల బయల్పఱచుటయే సుబ్బారావుగారి యభిమతము.

శ్రీ సుబ్బారావుగారికి హృదయాంతర్వర్తి యగు బ్రహ్మము చిరాయురారోగ్య భాగ్యము లొసంగుగాత !

మోపర్రు
తెనాలితాలూకా
23-10-1973

చారిత్రక శిరోమణి
విద్యావిశారద- విమర్శక శిరోమణి
కొడాలి లక్ష్మీనారాయణ

# నా మాట

సమాజజీవితము చాల విచిత్రమైనది. ఏ సమాజమైనప్పటికీ ఒక నాడు ఉన్నత శిఖరముల నందుకొని, మరియొకనాడు పతనమైన సంఘటనలు చరిత్రలో కోకొల్లలు. సాంఘిక, ఆర్థిక, రాజకీయ, మతసంబంధములైన ఒత్తిడులకు గురియైన సమాజము దుస్థితికి దిగజారుట అందరి లోకానుభవములోనిదే. సమాజమునందు కలుగుమార్పులను శిరసావహించి జీవించు మానవులు యాంత్రికజీవులు - లేదా-సామాన్య మానవులు. వీరు సమాజమునకు ఆలంబన అయినప్పటికీ, వీరివలన సమాజము ముందుకు పోజాలదు.

సమాజమునందలి దుస్థితిని ఎదుర్కొని, అనేక సాధకబాధకాలకు గురియైనప్పటికీ, తమ - లక్ష్యాలను సాధించువారు ధీరోదాత్తచిత్తులు. వీరే సార్థకజీవులు. వీరివలననే సమాజము ముందుకు నడచును. కవులై, రచయితలై, కళాకారులై, కొందరు, నాయకులై, సంఘసంస్కర్తలై, మతప్రచారకులై మరికొందరు ఈ సమాజమును ఋజుమార్గమున నడిపించుట వలననే, సమాజమునందొక వెలుగూ, వికాసమూ, నాగరికతా సంస్కృతుల కొక ఔన్నత్యమూ చేకూరుచున్నది. ఈ విధముగా సమాజపురోగతి మహావ్యక్తులపైనే ఆధారపడియున్నది. పరిస్థితుల ప్రభావము ఎటువంటిదైనప్పటికీ, జాతిని జాగృత పఱచి, చిత్తశుద్ధితో సంఘశ్రేయస్సుకు పాటుపడే మహనీయులు సదా గణనీయులు. వారే లోకకళ్యాణ కారకులు.

మహాకవుల జీవిత- సాహిత్య చరిత్రల రచనలో సిద్ధహస్తులు, విమర్శక రత్న బిరుదాంకితులు అయిన శ్రీ త్రిపురనేని సుబ్బారావుగారు

ఈ కోవకు చెందినవారు. మహాకవుల జీవిత చరిత్రలను రచించి. ప్రకటించుటయే పీరి జీవితలక్ష్యము. ఉత్తమవంశ నంజాతులు మా నుబ్బారావుగారు. వీరి సాహిత్య కృషివలన త్రిపురనేని వంశము మరియొకసారి పునీతమైనది.

"ప్రాణిలోకంబు నంసారపతిత మగుట। వసుధపైఁ గిట్టి పుట్టని వాఁడు గలఁడె। వాని జన్మంబు నఫల మెవ్వానివలన వంశమధికోన్నతి వహించి వన్నెకెక్కు" భర్తృహరి రచించిన పై ఉదాహృత పద్యమే నా అభిప్రాయమునకు తార్కాణము.

X X X

1970వ నంవత్సరములో 'కళాభవనము'నందు మహాకవి శ్రీ బోయి భీమన్నగారు రచించిన 'రాగవైశాఖి' అను వచన కావ్యముపై సాహిత్యగోష్ఠి జరిగినది. ఆనమావేశమునకు నుబ్బారావుగారు వచ్చినారు. అప్పుడు నేనూ, నుబ్బారావుగారూ కాకతాళీయముగా కలుసుకోవడము జరిగినది. నుబ్బారావుగారినిగురించి వ్యక్తిగతంగా తెలుసుకోవడమూ జరిగినది. వారురచించిన మహామనీషుల జీవిత చరిత్రలనుకూడా పఠించినాను. ఆనాటినుండీ నేటివఱకూ కనీసము వారమున కొకసారియైననూ మేము 'కవిరాజ సాహితీసదనము'లో కలుసుకొని, ఆంధ్ర సాహిత్యమునందలి నవ్యకవితా రీతులనుగురించి మాట్లాడుకొన సాగితిమి. మా నంభాషణ 'పోయట్రినుండి ఫిలాసఫీ' వఱకూవెళ్ళి, రాత్రి ప్రొద్దుపోయేవఱకూ చర్చించుచుండెడివారము. ఈ సాహిత్యగోష్ఠులవలన మా స్నేహము శుక్లపక్షచంద్రునివలె దినదినాభి వృద్ధిచెంది, మేము సాహితీ బంధువులమైతిమి.

సుబ్బారావుగారు రచించిన జీవితచరిత్రలను చదివినపిమ్మట, వారి జీవిత విశేషములను సాహిత్యకృషిని గ్రంథస్థము చేసినయెడల బాగుగానుండునను సంకల్పము నాకు కలిగినది. వెంటనే నా ఈ అభిమతమును సుబ్బారావుగారికి తెలియజేసితిని.

"మీరు నా జీవిత-సాహిత్యములను చక్కగను, చిక్కగను చిత్రించగల ప్రతిభావంతులు. అందులో నాకు ఏవిధమైన సంశయమూ లేదు. కాని నేనంత గొప్పవాడనా? జీవితచిత్రణకు కావలసిన సంఘటనలు, సన్నివేశములు నా జీవితమునం దుండవలయునుగదా! నేను రచయితనుమాత్రమే. అంతమాత్రముచేత నా జీవితరేఖలను ప్రకటించవలసిన ఆవశ్యకత కలదా?" యని విముఖత్వమును వెల్లడించినారు సుబ్బారావుగారు.

కవిరాజు త్రిపురనేని రామస్వామిచౌదరి, తత్త్వవేత్త శ్రీగోపీచంద్, కవిబ్రహ్మ ఏటుకూరి వెంకటనరసయ్య, అష్టావధాని హరి పురుషోత్తం ప్రభృతుల జీవితచరిత్రలను, 'కవిరాజు లేఖలు-డైరీలు' అను పరిశోధనా గ్రంథమును, వివిధపత్రికలలో అనేక సాహిత్య వ్యాసములను ప్రకటించి ఆంధ్ర సాహితీజగత్తులో లబ్ధ ప్రతిష్ఠులైనారు మీరు. జీవితచరిత్ర రచనలో సిద్ధహస్తులని రమారమి నలుబదిమంది పండితకవుల ప్రశంస లందుకొనిన మీరు సామాన్యులా? ముమ్మాటికీ కాదు. అన్నిటికీమించి, మీది "simple living and high thinking". మీ జీవితచిత్రణకు ఇవి చాలవా? మీ జీవితవిశేషములను, బహుముఖ వ్యాపితమైన సాహిత్యకృషిని రేఖామాత్రంగానైనా వ్రాసి ఆంధ్రపాఠకుల కందజేయవలయు ననే నా సంకల్పము. అందులకు మీరు అంగీకరించక తప్పదు," అన్నాను నేను.

"సరే, మీ యిష్టం" అన్నారు సుబ్బారావుగారు చిరునవ్వుతో. ఆ చిరు దరహాసమే ఈ జీవిత చిత్రణకు కారణభూతమైనది.

సాహితీ నందనంలో ప్రతిపుష్పము సౌరభమును వెదజల్లును: అంతమాత్రమున ఆ సౌరభమందరి కానందము చేకూర్పగల్గెనా? సహృదయతతో, లోకానుభవముతో, అత్యంత సమర్ధవంతముగ 'జీవిత చరిత్రచిత్రణ' అను ప్రత్యేకసాహితీ ప్రక్రియలో అందెవేసిన చేయిగా మహాకవుల, పండితుల ప్రశంసలందుకొన్న సుబ్బారావుగారు ఇప్పటికే ఆంధ్ర పాఠకలోకానికి సన్నిహితులైనారు. అట్టి వీరి జీవితచిత్రణ కుద్యుక్తుడనైన నాకృషి సాహసోపేతము కాజాలదు.

X X X

సుబ్బారావుగారి జీవిత చిత్రణకు కావలసిన విశేషములను సేకరించుటకు పూనుకొంటిని. త్రిపురనేని వంశ వృత్తాంతము, వారి గోత్రము, ఆ వంశమునందలి మహాపురుషులను గురించియూ, సుబ్బారావుగారి జీవిత విశేషములను, వారు ప్రకటించిన గ్రంథములను, వారి వ్రాతప్రతులను, వివిధ పత్రికలలో వారు ప్రకటించిన వ్యాసములను, అనేకమంది పండితకవులు సుబ్బారావుగారిని గురించి వెల్లడించిన అభిప్రాయములను, ప్రశంసలను, ఫొటోలను సేకరించితిని. గ్రంథ రచన పూర్తి చేసితిని.

నా ఈ రచన సుబ్బారావుగారి సాహిత్యమునకు దర్పణము వంటిది.

ఈ గ్రంథముయొక్క వ్రాతప్రతిని ఆమూలాగ్రముగా చదివి నా కృషిని ప్రశంసించి, వెన్నుతట్టిన మా గురువర్యులు విద్వాన్ T. S. R. అప్పారావు పంతులుగారికి నా హృదయపూర్వకమైన భక్త్యంజలి.

ఈ గ్రంథప్రచురణ భారమును వహించిన 'సుశీలా నికేతన్' సాహిత్యసంస్థవారికి నా ధన్యవాదములు.

నేను కోరినవెంటనే ఈ చిన్న పొత్తమునకు తమ అమూల్యమైన అభిప్రాయములను వ్రాసియిచ్చిన వాఙ్మయమహాధ్యక్ష, కళాప్రపూర్ణ, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారికి, డాక్టర్ శ్రీమతి నాయని కృష్ణకుమారి గారికి, చారిత్రక శిరోమణి శ్రీ కొడాలి లక్ష్మీనారాయణ గారికి నా హృదయపూర్వకమైన కృతజ్ఞతలు.

ఈ పుస్తకమునకు రేఖాచిత్రమును గీసియిచ్చి తమ సుహృద్భావమును వెల్లడించిన సుప్రసిద్ధ చిత్రకారులు, రసహృదయులు, మిత్రులు శ్రీ గోలి శివరామ్ బి. ఏ. గారికి నా కృతజ్ఞతాంజలి.

ఈ గ్రంథమును సర్వాంగసుందరముగా ముద్రించి ఇచ్చిన ప్రగతి ఆర్ట్ ప్రింటర్స్‌వారికి నా నమస్కృతులు.

వ్రాతప్రతికి నకలును చక్కని దస్తూరితో వ్రాసియిచ్చిన శ్రీ కె. యస్. విశ్వనాథంగారికి, ఈ పుస్తక ప్రచురణలో నాకు అనేక విధాలుగా తోడ్పడిన మిత్రులు శ్రీ వాసిరెడ్డి నారాయణరావుగారికి, శ్రీ వి. సత్యంగారికి నా స్నేహపూర్వక ధన్యవాదములు.

ఈ పుస్తకమునందు ప్రచురించిన అత్యధికభాగము ఛాయా చిత్రములను తీసియిచ్చిన ఛాయాగ్రాహకులు జనతా స్టూడియో ప్రొప్రైటరు శ్రీ వి. కోటేశ్వరరావుగారికి, ఆయా ఫొటోలతో బ్లాకులను తయారుచేసియిచ్చిన 'గురుబ్లాక్స్' వారికి నా ప్రశంసలు.

ఈ పుస్తకమును ఆంధ్ర పాఠకలోకం ఆదరిస్తుందని నా ఆశంస.

8-3-214/29
శ్రీనివాస కాలనీ
హైదరాబాద్ -38

ఇట్లు
మంత్రిప్రెగడ వీరభద్రమూర్తి



శ్రీ తిరుమల తిరుపతి వేంకటేశ్వర స్వామి

వారి

పాదపద్మములకు

భక్తి ప్రపత్తులతో

అంకితం



జీవిత చరిత్ర రచనలో సిద్ధహస్తులు, విమర్శకరత్న బిరుదాంకితులు
శ్రీ త్రిపురనేని సుబ్బారావుగారు

# జీవిత రేఖలు

కొందరు రచయితలు విషయపరిజ్ఞానమును కలిగియుందురు. మరికొందరు ఊహాపటిమను కలిగియుందురు. సుప్రసిద్ధ రచయితగా గణుతికెక్కవలయుననిన, విషయ పరిజ్ఞానముతో పాటు ఊహాపటిమ కూడ యెంతయో అవసరము. ఈ రెండవ కోవకు చెందినవారు శ్రీ త్రిపురనేని సుబ్బారావుగారు. త్రిపురనేనివారి 'గృహనామము'ను గురించి, చక్కని ఆసక్తిజనకమైన, చరిత్రాత్మకమైన నేపథ్యగాథలు గలవు.

## చారిత్రక గాథ

కాకతీయ రాజవంశమునందు ప్రసిద్ధుడైన ప్రతాపరుద్ర దేవుని వద్ద 'శంభుడ'ను సేనాధిపతి యుండెను. ఈ శంభునిగూర్చి కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారు *'సూత పురాణము' లో ఇట్లు పేర్కొనినారు.

"శంభర్ధ్వంసుఁడై సా
చ్ఛంభుఁడె యీ వంగడమున జన్మించెననన్
శంభుఁడు కూటస్థుండై
యంభోనిధిఁ గల్పవృక్షమట్టుల వెలసెన్"

ఈ శంభుని గురించి మహాకవిశేఖర, కవిసింహ, బ్రహ్మశ్రీ పోకూరి కాశీపత్యవధానులుగారు ఇట్లు వర్ణించినారు.

---

*ప్రథమాశ్వాసము — 61 వ పుట.

## 2

సీ॥ త్రిపురంబులను ధరిత్రిని గల్పె నాతండు
త్రిపురంబుల నముద్ధరించె నితఁడు
ఆత్మజనాశకుఁడై చరించు నతండు
ఆత్మజప్రియుఁడయి యలరు నితఁడు
అప్పులభార మెల్లప్పుడొందు నతండు
అప్పులుమోయని యధికుఁడితఁడు
తిప్పలపాలయి తిరుగుచుండు నతండు
తిప్పలపొల్గాని దివ్యుడితఁడు

గీ॥ హవహరుఁడతండు హవసహాయకుఁ డితఁడు
గాన రజతాచల నివాసుఁడైన శంభు
డోరుగల్లు నగరంబున నుండునట్టి
శంభునకు నెవ్విధంబున సాటివచ్చు.

"శంభునిగేరు మహోగ్రత
శంభుని దూరున్ విభూతి చర్చింపగనా
శంభుని మీఱు యశోద్యుతి
శంభుని తీరుగల జోదు జగతిన్ గలఁడే".

ఆంధ్రదేశ పరిరక్షణకొఱకు ఢిల్లీ సుల్తానుల నెదిరించి పోరిన మహావీరుడు శంభు సేనాధిపతి. రణరంగమునందు అతఁడు శత్రు సంహారముచేసి, వారి రక్తపు మడుగులలో తన వాడియైన ఖడ్గమును కడిగెను. శంభు దళవాయి యుద్ధము చేసినతీరు యిట్లు వర్ణింపబడినది.

"ఆ సమరంబు, శంభుని భుజానికిఁ బండుగయాయె; లాస్యలీ
లాసమవిభ్రమ భ్రమణ మారని నివ్వెరఁగూరు మార్తురన్
ఏసిన తత్ప్రహారమున నించుక తేర్కొని బాపురే పశ్శం
సాసుహృదుక్తిఁ బల్కు, బడిబాగిలరే దళితోత్తమాంగులై!"

ఆ॥ "అరదములను రాల్చె ద్విరదంబులను గాల్చె
హరులడుల్చె మొనసి యరుల గూల్చె.
స్వపుర రక్షణంబుఁ ద్రిపుర మోక్షంబును
గోరఁజూచె రిపులు పాఱఁజూచె."

ఆ సంకులసమరములో ఆ దండనాయకుడు ప్రదర్శించిన ధైర్య స్థైర్యములకు ప్రతాపరుద్ర ధరణీపతి మెచ్చి, అతనికి త్రిపురములనిచ్చి, వాటికి ఱేడుగా ప్రకటించి, ఘనముగా సత్కరించెను. త్రిపుర + ఱేడు=మూడు పురములకు రాజు. 'ఱేడు' కాలక్రమేణా 'నేడు'గా మారి, దాని షష్ఠీ విభక్త్యంత రూపమే 'నేని' యైనది. ఆనాటినుండి శంభుని వంశజులకు త్రిపురనేని గృహనామము సార్థకమైనది. "ఈ త్రిపురనేని వంశము క్షాత్రధర్మ భాసితమైన వీర వంశముగా వాసికెక్కినది. "వీరిది కదనరంగములో కత్తులుదూసిన సైనిక వంశము" అన్నారు సుప్రసిద్ధ చారిత్రక పరిశోధకులు శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు.

త్రిపురనాయకుడు యుద్ధము చేయునప్పుడు 'తురాయి' గల తలపాగాను ధరించెడివాడు. ఆ తలపాగను ధరించి అశ్వారూఢుడైన శంభుని అష్టావధాని హరి పురుషోత్తంగారు ఇట్లు వర్ణించినారు.

"ఛంగున ఛంగుఛంగునను శంభు తురంగము చౌకళింపఁగా
ఖంగున ఖంగుఖంగునను కత్తులు ప్రక్కలుడుల్లగా, సమిత్
రంగమునందు నాతని 'తురాయి'ని నాడెడు పువ్వుఁబట్టి, ర
క్షంగనినారు నాఁడు మలకల్ మతివిహ్వలురై భ్రమించుచున్."

ఆ సేనాధ్యక్షుని 'తురాయి' నాడెడు పువ్వునుజూచి 'పువ్వాడు' వచ్చుచున్నాడని రణరంగమున శత్రువులు భీతిజెంది, చెల్లాచెదరుగా పాఱిపోయెడివారు. తత్కారణమున త్రిపురనేని వంశీయులకు *'పువ్వాడ' గోత్రము సార్థకమైనది.

---

*కూర్మ రాజీయము—ఆచార్య ప్రాలడుగు శేషాచలవర్మగారు.

# 4

## ద్వితీయ గాథ

ఆంధ్రదేశములో మరియొక గాథకూడా ప్రచారములో నున్నది.

తెలుగునాట గండోపలము (పెద్దరాతిగుండు) నకు సమీపమున కొందరు కర్షకులు ఒకపల్లెను నిర్మించుకొనిరి. దానికి 'ఓరుగల్లు' అని పేరిడిరి. ఆనాటి 'ఓరుగల్లు' నేడు 'వరంగల్'గా వ్యవహరింపబడు చున్నది. కాకతీయ ప్రతాపరుద్ర మహారాజు అది దివ్యక్షేత్రమని గ్రహించి, ఆ ఖేటమున కోటను, పేటను వరుసగా గట్టించి, చతురంగ బలముతోడను, శంభుడను దండనాయకుని సహాయముతోడను ఓరుగల్లు రాజధానిగా కాకతీయసామ్రాజ్యమును ప్రజారంజకముగా పరిపాలించెను.

ఒకసారి ప్రతాపరుద్ర ధరణీపతి శంభుని రాజధానికి కాపుంచి, తాను దండయాత్రకేగెను. ఈ సంగతి తెలిసిన శత్రువులు ఓరుగంటిని ముట్టడించిరి. అప్పుడు శంభుడు సైన్యసమేతుడై కడు సాహసోపేతముగా పోరాడి శత్రువులను పారద్రోలెను.

ప్రతాపరుద్ర మహీపాలుడు తిరిగిరాగానే పౌరులందరూ జనపతికి మ్రొక్కి ఈ విధముగా విన్నవించిరి. 'మనుజేంద్రా! తాము దిగ్విజయ యాత్ర కేగినపుడు, విరోధులు మన త్రిపురములను ముట్టడించిరి. మన దండనాయకుడైన శంభుడు శాత్రవులను త్రిపురములలోనికి జొరబడ నీయక, అవక్ర పరాక్రమముతో పోరాడి వారని తరిమివేసినాడు. మన శంభునివంటి జోదు మరియొకడు ఈ జగతిలో గలడా ?" అని నుడివిరి.

ఈ మాటలను ఆకర్ణించిన మహారాజు శంభుని కౌగలించుకొని, ఉచితాసనమున కూర్చుండబెట్టెను. త్రిపురములు శత్రువుల కైవసము

గాకుండ కాపాడినందులకు, త్రిపురములకు—మూడు మేడలవంటి పెద్ద దుర్గములకు అధిపతినిచేసి, ఉచితరీతిని సత్కరించెను. అదిమొదలు శంభుని సంతతికి త్రిపురనేని వారని 'ఇంటిపేరు' వచ్చినది.

ఓరుగల్లు నందలి పువ్వాడ (పువ్వు + వాడ = పువ్వాడ = పూవులమ్ము పేట) లో శంభుడు నివసించుటచే అతని వంశజులకు 'పువ్వాడ' గోత్రము లభించినది.

## తృతీయ గాథ

కృష్ణాజిల్లాలోని గుడివాడకు ఐదుమైళ్ళ దూరమున 'అంగలూరు' అను గ్రామము కలదు. ఈ గ్రామమునకు శతాబ్దముల చరిత్రయున్నది. దాని పడమటి యంచున నిన్న మొన్నటివరకు ఒక పాటిదిబ్బయుండెడిది. ఆదిబ్బ కాకతి దేవాలయ శిథిలావశేషములకు గుర్తు. ఆ దేవాలయమును ఓరుగంటి ప్రతాపరుద్రుడు జైత్రయాత్ర చేయుచు వచ్చి అక్కడ నిర్మించెను దీని కాగ్నేయదిశలో ననతి దూరమున 'కౌతవరము'అనెడి గ్రామము కలదు. నాడు కాకతీయులను విజయలక్ష్మి వరించిన ప్రదేశ మగుటచేత నిది కాకతీ వరమని పేరొంది, క్రమముగ కౌతవరముగ మారినది. జైత్రయాత్రకు బయలుదేరి ప్రతాపరుద్రుడు విడిదిచేసిన ప్రదేశమే అంగలూరు. సేనానియగు శంభుని అక్కడ నిలిపి అతడు ఓరుగల్లున కరిగెను. ఈ శంభుడు 'త్రిపురనేని' వారికి మూలపురుషుడు.

శంభుడు అంగలూరును తన నివాసముగ చేసికొనెను. అతడు ప్రతాపరుద్రుని యనుమతితో శైవమతానుసారముగ నందివాడ, గుడివాడ. కౌతవరములందు శివాలయములను నిర్మించి చక్కగ ప్రజాపాలనము చేయుటచే, రాజాతనిని పిలిపించి "త్రిపురనేడు" అను బిరుద

నామముతో నత్కరించెను. క్రమక్రమముగ 'త్రిపురనేడు' 'త్రిపురనేని'గ మారినది. శంభుని వంశమువారి కది ఇంటిపేరు అయినది. పై మూడు ప్రదేశములకు అంగలలో చేరగల దూరమందుండుటచే దీనికి 'అంగలూరు' అను నామము సార్థకమయ్యెను.

మహత్తర ప్రాచీన వైభవము, ఆధునిక ప్రశస్తిగల త్రిపురనేని వారు కమ్మవారు. ఇప్పటి కృష్ణా, గుంటూరు మండలములందు వీరు వ్యాపించియున్నారు. నత్సంప్రదాయము, నంస్కృతీ విలసితము, చారిత్రక ప్రసిద్ధిగాంచిన ఈ వంశీయులనుగురించి కవిశేఖర జి. జోసఫ్ కవి యిట్లు ప్రశంసించినాడు.

*''దండున పేరుగొన్న నరదారులు, విక్రమ రాజకీయ మా
ర్తాండులు, సాహితీప్రియు లుదారులు, దుర్ఘటకార్యసాధనో
ద్దండులు, తత్త్వవేత్తలు. నదాబిరుదంబులనంది కీర్తితో
నిండినవారు, మా త్రిపురనేని కులీనులు తెల్గు ధాత్రిలో."

మహాకవిశేఖర, కవిసింహ, బ్రహ్మశ్రీ పోకూరి కాశీపత్యవధానులు గారు త్రిపురనేని వారి ప్రశస్తి నిట్లుగ్గడించినారు.

"ఖ్యాతియందుఁ బరమ నీతియందును స్థిర
భూతియందు సానుభూతియందు
సాతియందు నిత్యప్రీతియందును లేమి
లేనివారు త్రిపురనేనివారు."

---

తృతీయగాథ—కవిరాజ జీవితము — సాహిత్యము —
శ్రీ గొట్టిపాటివేంకట సుబ్బయ్యగారు.
*గోలకొండ పత్రిక —10-1-1966.

ధీరులు బళిరే వాయు కు
మారులు బాహుబల విక్రమంబుల శ్రితమం
దారులు సత్కారుణా కూ
పారులు శ్రీ త్రిపురనేని వారలు ధాత్రిన్."

త్రిపురనేని వారు ఒకే కూటస్థులైనను జాతాశౌచ, మృతాశౌచాది కములైన ఇబ్బందులవలన 'త్రిపురనేని', 'తిపిర్నేని' అను రెండువర్గ ములుగ చీలినారు. ఈ వంశమునకు వన్నెదెచ్చినవారిలో త్రిపురనేని గోపాలయ్యగారు, శతావధాని, కవిరాజు, త్రిపురనేని రామస్వామిచౌదరి గారు. వీరి కుమారులైన, కథా సాహిత్య సమ్రాట్, సుప్రసిద్ధ నవలా రచయిత, తత్త్వవేత్తలైన శ్రీ త్రిపురనేని గోపీచంద్‌గారు-ముఖ్యముగా పేర్కొనఁదగినవారు.

## జ న న ము

క్రీ. శ. 1904 సంవత్సరమున కృష్ణాజిల్లా నుండి గుంటూరుజిల్లా వేరుచేయబడినది. ఆ సమయమున ఇట్టి వాసికెక్కిన వంశమహీజశాఖ గుంటూరు మండలము నందలి "కూచిపూడి" గ్రామములో వేరూనినది. ఆ గ్రామము ఈ క్రింది విధముగా వర్ణింపబడినది.

సీ॥ శ్రీలతో సాధుజనాలతోఁ బావన
స్త్రీలతో భూరి సౌధాలతోడ
పాలతో దీటౌ జలాలతో నెసఁగు యం
త్రాలతో మించు దీపాలతోడ
చేలతోఁ బడయుధాన్యాలతో విపణి చ
యాలతోఁ గ్రీడావనాలతోడ
పూలతో సఫల వృక్షాలతో ధర్మ స
త్రాలతో దేవాలయాలతోడ

జేలతో మించు దైవోత్సవాలతోడ
హేలతో వినఁదగిన తూర్యాలతోడ
నాలతో భవ్యతర వృషభాలతోడ
ప్రోలెపో కూచిపూడి నల్లీలఁజూడ.

కం॥ ఆ పురమున విలసిల్లఁగ
గా పురమును జేయుచుంద్రు కమ్మకులీనుల్
దీపింతు రందు శివనే
వాపరులగు త్రిపురనేనివారలు తలఁపన్.

ఆ గ్రామమునందలి మధ్యతరగతి రైతుకుంటుంబమున పుణ్య దంపతులైన త్రిపురనేని వీరయ్య, వీరమ్మల గర్భశుక్తి ముక్తాఫలముగా 1929 సం. జూలై 1వ తేదీన శ్రీ త్రిపురనేని సుబ్బారావుగారు జన్మించి నారు. వీరి బాల్యములోనే ప్రియతమజనకులు, సజ్జనులునయిన వీరయ్య గారు పరమపదించినారు. అట్టి ఆపత్సమయములో ఈ కుటుంబమును వీరి మాతామహులైన పాలడుగు వెంకయ్యగారు తమ స్వగ్రామమైన 'పెదరావూరు' కు తీసుకొనివెళ్ళి, పోషణభారమును వహించినారు. వెంకయ్యగారు గొప్ప వీరుడు. వారిని గురించి మహాకవిశేఖర పోకూరి కాశీపత్యవధానులుగారు ఇట్లు ప్రశంసించినారు.

*"దండము నింటి వేల్పునకు దద్దయుబెట్టి పటుత్వమైన బల్
దండముఁ జేతఁబట్టి నిజధామమునుండియుఁ దాను మత్తవే
దండము రీతి వచ్చునెడ దారిన నెవ్వరికేని తన్మహో
ద్దండముగల్గు వెంకయ నదాటునఁజూచిన భీతిగల్గదే."

---

*శ్రీశైల మల్లేశ్వర శతకము.

"దండధరుం డొకప్పుడిలఁ దప్పొనరించినవాడు చిక్కినన్
దండనఁజేయకోర్చుకొని తా విడినన్ విడుగాని యెన్నఁడీ
దండధరుండు ప్రాజ్ఞులకు తప్పొనరించినవాఁడు చిక్కినన్
దండనఁజేయ కోర్వఁడని ధాత్రిని వాడుకగద్దు నేటికిన్."

వెంకయ్యగారి ధైర్యసాహసములను గురించిన కథలు ఈనాటికీ ప్రజలు ఆగుబ్బుగా చెప్పుకోవడము కద్దు.

పంచవర్షప్రాయమున సుబ్బారావుగారికి అక్షరాభ్యాసము జరిగినది. ఆ సందర్భములో శ్రీ సిరిపురపు వెంకటప్పయ్యపంతులు గారు బడిలోని బాలకులందరికీ పంచదారతో కలిపిన కొబ్బరిముక్కలు పంచిపెడుతూ "నాయనా! సుబ్బారావ్ బాగుగాచదువుకొని, మీవంశము యొక్క పరువుప్రతిష్ఠలు నిలబెట్టవలయును'' అన్నారు. ఆనాటినుండి సుబ్బారావుగారిలో ఒకవిధమైన జిజ్ఞాస జనించినది.

సుబ్బారావుగారు దశవర్షప్రాయములోనుండగా వీరి మాతామహు లైన వెంకయ్యగారు దివంగతులైనారు. పిమ్మట వీరి మేనమామ పాలడుగు రాఘవయ్యగారు గృహాధిపత్యమును చేపట్టి చక్కగా నిర్వహించినారు.

చిన్నతనములో సుబ్బారావుగారికి ఆటలయందు మిక్కిలియాసక్తి యుండెడిది. ఆటలపోటీలయందు సువర్ణ, రజిత పతకములు బహుమతి పొందినారు. ప్రతిదినము ప్రాతఃకాలముననే వ్యాయామము చేయడము అలవాటు చేసుకొనినారు. కొంతకాలము కడపకుచెందిన ప్రసిద్ధపహిల్వాన్ 'షేక్ యూసుఫ్' వద్ద కుస్తీపట్లు నేర్చుకొనినారు.

సుబ్బారావుగారు హైస్కూలులో చదువుకొనునప్పుడు ప్రతి తరగతిలోనూ ఫస్టుమార్కులు వచ్చుచుండెడివి. వీరు ప్రతిదినము రాత్రి పది గంటలవఱకు పాఠములన్నియు కంఠోపాఠముగా చదువు కొనిన పిమ్మట నిద్రించెడివారు. తెల్లవారుఝామున లేచి మరల చదువు కొనెడివారు తెనాలితాలూకా హైస్కూలులో శ్రీ పరిమి సీతారామశాస్త్రి గారు, శ్రీ పిల్లలమఱ్ఱి గోపాలకృష్ణయ్యగారు వీరికి కడుశ్రద్ధగా చదువు చెప్పినారు. హైస్కూలులోని ఉపాధ్యాయుల ఆదరాభిమానములనుఁ జూఱగొనినవారు సుబ్బారావుగారు. హైస్కూలువిద్యను అత్యంత క్రమ శిక్షణతో 1946 వ సం॥లో పూర్తిచేసినారు. ఉన్నత విద్యాభ్యాసము కొఱకు గుంటూరు హిందూ కళాశాలలో ప్రవేశించినారు. అచ్చట 'ఇంటర్మీడియట్' చదువుచుండగనే బ్రాహ్మణకోడూరు వాస్తవ్యులైన యడ్లపల్లి లక్ష్మీనారాయణగారి ప్రథమపుత్రిక జయప్రదాదేవిని వివాహము చేసికొనినారు. అది ఎప్పుడనిన—

* "అగ్నికచ[illegible] నము నకఱతోఁ జేసి
పూని పెండ్లిఁ ద్రిపురనేని సుబ్బ
రావు దీని మొదట రాణింపనగు హూణ
శక గతాబ్దమధ్య జరుపుకొనియె."

ఈమె ఆదర్శ గృహిణి. ఈమెకు దైవభక్తియందును, సనాతన ధర్మమునందును విశ్వాసమెండు. రామాయణ, మహాభారత, భాగవత, భగవద్గీతాదులు ఈమెకు నిత్యపారాయణ గ్రంథములు.

---

* 1943.



భావ విప్లవ విధాత, కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారు
సుబ్బారావుగారి గురువర్యులు

ఆమెనుగుఱించి మహాకవిశేఖర కాశీపత్యవధానులుగారు యిట్లు శ్లాఘించినారు.

"మేదుర సౌశీల్యంబును
శ్రీదేవీ పూజ భర్తసేవ సదాతి
థ్యాదరణము గల్గుట భువి
నాదర్శ ప్రమద గద జయప్రద దలంపన్."

వ్యవసాయశాస్త్రము, వృక్షశాస్త్రము, రసాయనిక శాస్త్రములతో సుబ్బారావుగారు 'ఇంటర్మీడియట్'లో ఉత్తీర్ణులై, బి.ఏ చదువునప్పుడు చరిత్ర, ఆర్థిక శాస్త్రము, రాజకీయ శాస్త్రములను అభ్యసించినారు. 1951 సం॥ లో సుబ్బారావుగారు ఆంధ్ర విశ్వవిద్యాలయము నుండి బి. ఏ. పట్టమును బడసినారు.

## సూతాశ్రమ విద్యార్థి

సుబ్బారావుగారికి బాల్యమునుండియూ ఆంధ్ర సారస్వతముపై మిక్కుటమైన మక్కువ యుండెడిది. భావ విప్లవవిధాత, శతావధాని, కవిరాజు శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరిగారు తెనాలిలో 'సూతాశ్రమము'ను స్థాపించినారు. సూతాశ్రమములో కవిరాజుగారి అంతేవాసిగా నుండి, ప్రబంధములను కూలంకషముగా పఠించి, వాటి లోతులను తఱచి, అందచందములను చవిచూచినవారు సుబ్బారావుగారు. భావ వికాస కేంద్రమైన సూతాశ్రమము సుబ్బారావుగారి రచనా నైపుణ్యమును తీర్చిదిద్దినది. బహుముఖ ప్రజ్ఞా జిజ్ఞాసువుగా చేసినది. ఆనాటి అనుభవము వీరి రచనలపై చెఱగని ముద్ర వేసినది.

ఆరోజులలో నూతాశ్రమమును సందర్శించిన యొక కవిశేఖరుడు సుబ్బారావుగారిని గురించి యిట్లు వర్ణించినాడు.

"ఆశ్రిత పారిజాతము, సదానుతులందిన రామసామి నూ
తాశ్రమ సీమలందున విహారమొనర్చుచు సుబ్బరాయు డెం
తే శ్రమజేసి కావ్యముల దివ్యమృగా బఠియించి ధీవియై
విశ్రుత పాండితీబల వివేకము గాంచెను కీర్తికాముడై."

ఆంధ్ర సారస్వత రంగమునందు పరిశోధనకు సమగ్రమైన చర్చావేదిక లేని ఆ రోజులలో, కవిరాజుగారి నిశిత శిక్షణయే సుబ్బారావుగారి పరిశోధనాత్మకశక్తిని తీర్చిదిద్దినది. రామస్వామిచౌదరి గారి యడుగుజాడలలో నడచుచున్నవారు సుబ్బారావుగారు. వారి శుశ్రూషవలన తనలో జ్యోతిష్ప్రకాశము కలిగినదని కవిరాజుగారిపట్ల సదా కృతజ్ఞతాభావమును గల్గియున్నారు. సుబ్బారావుగారు హైదరా బాద్‌లో 1969వ సం॥ లో కట్టించిన తమ స్వంతభవనమునకు గురువు గారి స్మృత్యర్థము "కవిరాజ సాహితీ సదనము" అని నామకరణము చేసినారు. ఆంధ్రదేశములోని అనేకమంది ప్రసిద్ధకవులు, ప్రఖ్యాత రచయితలు, పరిశోధనాచార్యులు, జ్యోతిష్కులు, జర్నలిష్టులు, పండి తులు, పారిశ్రామికవేత్తలు — వివిధ రంగాలలోని ప్రముఖవ్యక్తులు 'కవిరాజ సాహితీ సదనము' ను దర్శించుచూ యుందురు. వారందరి తోనూ సుబ్బారావుగారు ఇష్టాగోష్ఠి జరుపుచుందురు. 1970వ సం॥ లో 'కవిరాజ సాహితీ సదనము'ను సందర్శించిన మహాకవిశేఖర, బ్రహ్మశ్రీ పోకూరి కాశీపత్యవధానులుగారు దాని నీవిధముగా వర్ణించినారు



కవిరాజ సాహితీ సదనం, హైదరాబాద్.



మహాకవిశేఖర, చిత్రకవితా ప్రవీణ, శతావధాని, కవిసింహ గద్వాల ఆస్థానకవి బ్రహ్మశ్రీ పోకూరి కాశీపత్యవధానులుగారితో విద్వద్గోష్ఠి సమయాన శ్రీ గులాం యాసిన్, శ్రీ సుబ్బారావుగారు, అవధానిగారు, శ్రీ యం. వి. బి. మూర్తి, కేశవాచార్య గారలు.

సీ॥ జాలతోనైన కుడ్యాలతోఁ బలుకొట్టి
డీలతోఁ బెను పడసాలతోఁడ
చాల తోరపు కవాటాలతోఁ బలుకిటి
కీలతోఁ బంచపాళీలతోఁడ
సీలతోయముల యంత్రాలతో మెరుపు దీ
పాలతో గాలి జంత్రాలతోఁడ
లీలతోఁ బొనఁగు జేజేలతో నెనఁగు వ
టాలతో నిల్వుటద్దాలతోఁడ

గీ॥ వాలుకుర్చీలతోఁడ బల్లాలతోఁడ
మేలి మంచాలతోఁడ బీర్వాలతోఁడ
హేలలో నోలలాఁడనౌ లీలనాఁడ
శ్రీలలరు సుబ్బరావుండు మాలెఁజూడ.

## గోపీచంద్ సహచర్యం

కవిరాజుగారివద్ద 'సూతాశ్రమము'లో చదువుకొనేనాటినుండియూ గోపీచంద్‌గారికి సుబ్బారావుగారి యెడల సోదరభావ ముండెడిది. 1939వ సం॥ లో గోపీచంద్‌గారు మద్రాసువెళ్ళి సినిమారంగములో ప్రవేశించినారు. చలనచిత్ర దర్శకులుగా, సంభాషణా రచయితగా ఖ్యాతి గడించినారు. పిదప సినిమారంగమును వదలివేయ దలచుకొని నారు. నలుబది సంవత్సరముల నుండియు ప్రత్యేక రాష్ట్ర నిర్మాణము కొఱకు ఆంధ్రులు సాగించిన అవిరళ కృషి ఫలించినది. పొట్టి శ్రీరాములుగారి పూర్ణాహుతితో 1–10–1953 న ఆంధ్రరాష్ట్రము అవతరించినది. మద్రాసు నుండి మూటా ముల్లె కట్టుకొని ఆంధ్రులందరూ

ఆంధ్రరాష్ట్ర రాజధానియైన కర్నూలు తరలివచ్చినారు. నూతనముగా నేర్పడిన ఆంధ్ర ప్రభుత్వము గోపీచంద్‌గారిని సమాచారశాఖకు డైరెక్టరుగా ఆహ్వానించినది. ఆ యాహ్వానమును వారు హర్షముతో అంగీకరించినారు. క్రొత్తగా నేర్పడిన రాష్ట్రప్రభుత్వమునకు సహాయ పడుట తమ విద్యుక్తధర్మముగా భావించి, మద్రాసు నుండి కర్నూలు తరలి వచ్చినారు. సమాచార డైరెక్టరుపదవిని అలంకరించి కడుసమర్థ వంతముగా నిర్వహించినారు. అప్పుడు సుబ్బారావుగారు గోపీచంద్‌గారి సహచరులుగ కర్నూలులో నుండినారు. ఈ సాహచర్యమువలననే రాష్ట్రసచివాలయములో ప్రభుత్వోద్యోగము సుబ్బారావుగారికిలభించినది. ఈ విధముగా గోపీచంద్‌గారు, సుబ్బారావుగారు ఒకరినొకరు మరల కలుసుకొనుట జరిగినది.

గోపీచంద్‌గారి గృహములో అరవిందమహర్షి జన్మదినోత్సవ ములు జరుగుచుండెడివి. అరవిందాశ్రమమును చూచినవారు, అరవిందుని సాహిత్యముతో పరిచయముగలవారు, వారివారి యనుభవములను గురించి ప్రసంగించు చుండెడివారు. ఈ సమావేశములకు సుబ్బారావు గారు కూడా హాజరగుచుండెడివారు.

ముక్కోటి యాంధ్రుల చిరకాలవాంఛితమైన ఆంధ్రప్రదేశ్ 1956 నవంబరు 1వ తేదీన యేర్పడినది. గోపీచంద్‌గారు, సుబ్బారావు గారు కూడా ఉద్యోగరీత్యా హైదరాబాదు రావలసివచ్చినది. గోపీచంద్ గారు కొంతకాలము సమాచారశాఖలో జాయింట్ డైరక్టరుగా నుండి, ఆపదవినుండి వైదొలగి, 1957వ సం॥లో ఆకాశవాణి హైదరాబాదు కేంద్రములో గ్రామస్థుల కార్యక్రమముల ప్రయోక్త (Rural programmes' producer)గా నియమితులైనారు. ఆనాటినుండి గోపీచంద్



శ్రీ సుబ్బారావుగారిని సాహితీ విమర్శకులుగా తీర్చిదిద్దిన మహారచయిత,
శ్రీ త్రిపురనేని గోపీచంద్



సుబ్బారావుగారు రచించిన హరిపురుషోత్తం
జీవిత చిత్రణను ఆవిష్కరిస్తున్న మహామనీషి
ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు



అభినవ తిక్కన, కళాప్రపూర్ణ శ్రీ తుమ్మల సీతారామమూర్తి,
శ్రీ పోకల ధనంజయరావుగార్లతో శ్రీ సుబ్బారావుగారు

గారు సుబ్బారావుగారికి ఆకాశవాణిలో అనేక కార్యక్రమములలో అవకాశములు కల్పించుచూ, ప్రోత్సహించినారు. గోపీచంద్‌గారికి సుబ్బారావుగారి యెడలగల సోదరప్రేమ వర్ణింప నలవిగానిది.

గోపీచంద్‌గారి సాహచర్యమే సుబ్బారావుగారిలో నూతనచైతన్యమును కలిగించినది. వీరి సాహితీ పిపాసను, విమర్శనాశక్తిని గుర్తించిన గోపీచంద్‌గారు, సుబ్బారావుగారికి సాదరముగ నొక సందేశము నిచ్చినారు.

"ఎట్టి విపరీత, విపత్కర పరిస్థితులలోనూ ఈ రచనా వ్యాసంగమును విడనాడవద్దు. సాహితీ రంగములో నీభవిష్యత్తు ఉజ్వలముగా నుండగలదు. ఇది నా ఆశీస్సు" అన్నారు

గోపీచంద్‌గారి, పై సందేశమే సుబ్బారావుగారిని సాహితీరంగములో ముమ్ముందుకు నడిపించుచున్నది. వారిచ్చిన అమూల్యమైన సందేశమే సుబ్బారావుగారి జీవితలక్ష్యమైనది.

1962వ సం॥ నవంబరు 2వ తేదీన కథ వ్రాసుకొంటున్న గోపీచంద్‌గారు శాశ్వతముగా కన్నుమూసినారు. ఈ విషాదవార్త సాహితీలోకమును దుఃఖసాగరములో ముంచివేసినది. తీవ్రమైన మనోవేదనతోనూ, శోకతప్త హృదయముతోనూ, సుబ్బారావుగారు తమ సానుభూతి సందేశము నీవిధముగా ప్రకటించినారు.

*"గోపీచంద్‌గారి మరణవార్త విని నిర్ఘాంతపోయితిని. ఆయన నాకు అన్నగారు. ఎంతో ఆదరంతోనూ, ఆప్యాయంగానూ నన్ను

*గోలకొండ పత్రిక — 3-11-1962.

చూచేవారు. నేను వారింటికి కుటుంబసమేతముగా వెళ్ళి పరామర్శించి ఇంకా వారంరోజులు కాలేదు. వారు కనీసం దశదశాబ్దాలు జీవిస్తారని ఆశించాను. ఇంత త్వరలో మరణిస్తారని నేను కలలోకూడా భావించ లేదు. వారి మరణం వ్యక్తిగతముగా నాకు ఎంతో బాధగలిగించినది. అది నాకు తీరనినష్టం. దుఃఖసముద్రములో మునిగియున్న నా వదినెగారైన శకుంతలాదేవి గారికి నా సానుభూతి తెలియజేస్తున్నాను."

ఈ విధముగా కవిరాజు రామస్వామి చౌదరిగారితోనూ, గోపీచంద్‌గారితోనూ, సుబ్బారావుగారికి గల అత్యంత నిష్కహిత సంబంధమే వారి జీవితచరిత్రలను రచించుటకు ప్రేరేపించినది. సుబ్బారావుగారు రామస్వామిగారివద్ద చదువుకొన్న పట్టికీ, వారిని రచయితగా, విమర్శకునిగా చేసినఘనత గోపీచంద్‌గారిదే యనుట అతిశయోక్తికాదు.

## సారస్వత గ్రంథములు

సుబ్బారావుగారు సుప్రసిద్ధ రచయితయే గాక, పరిశోధనలో అందెవేసిన చేయి. మహామనీషుల జీవిత సాహిత్యములను తఱచిచూచి, పరిశోధనాత్మకమైన దృష్టితో వారి జీవితచరిత్రలను రచించినవారు. ప్రాచీన, అర్వాచీన ఆంధ్ర వాఙ్మయమునకు జెందిన వ్యాసములను, 'ఆంధ్రాభ్యుదయము' నందు పొందుపఱచినారు. ఇందులోని 'సాహిత్య నిర్మాతల సంస్మరణ', 'మహేంద్రోద్యమము' అను రెండు వ్యాసములు సుబ్బారావుగారి పరిశోధనాశక్తికి తిరుగులేని తార్కాణములు.

'సాహిత్య నిర్మాతల సంస్మరణ' అను వ్యాసములో విప్లవోద్యమమునకు సాహితీవేత్త లేవిధముగా దోహదముచేసినదీ వ్యక్తము చేయబడినది. కందుకూరి, గురజాడ, కొమఱ్ఱాజు, కాశీనాధుని, రాయప్రోలు,

చిలకమర్తి, జనవరాజు, గరిమెళ్ళ, త్రిపురనేని, దువ్వూరి, జాషువా, తుమ్మల, దాశరథి, నారాయణరెడ్డి, కాళోజీ, అరుద్ర మొదలైన సాహితీ వేత్తలు నవసమాజ నిర్మాణమున కేవిధముగా పునాదులు వేసినది క్లుప్తముగా పేర్కొనబడినది.

అన్నింటికంటే మిన్నగా వ్రాయబడినది 'మహాంధ్రోద్యమము' అను వ్యాసము. చరిత్రను పరిశోధించి, ఆంధ్రరాష్ట్ర వాంఛ ఎప్పుడు ప్రారంభమైనదీ, ఏవిధముగా అభివృద్ధి చెందినదీ పేర్కొనబడినది.

1911వ సం॥లో గుంటూరునందలి సబ్‌కోర్టులో ఆఱెండరు ఉద్యోగమునకు జరిగిన కుంభకోణమే ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర వాంఛకు దోహదము గావించినది. అదే నాందియని కూడా సుబ్బారావుగారు పేర్కొనినారు. తరువాత 1918 సం॥లో 'ఆంధ్ర మహాసభ' ప్రాదుర్భవించడమూ, కాశీనాథుని నాగేశ్వరరావుగారూ, ముట్నూరి కృష్ణారావుగారూ, కొమర్రాజు లక్ష్మణరావుగారూ, పట్టాభి సీతారామయ్యగారూ, ఆచార్య రంగాగారూ, అయ్యదేవర కాళేశ్వరరావుగారూ – ఆంధ్ర రాష్ట్రోద్యమమునకు ఏవిధముగా దోహదముచేసినదీ సమగ్రముగా వ్రాయబడినది. ఈ పుస్తకమునందలి వ్యాసములన్నిటికి ఇది తలమానికమైనది.

ఈ గ్రంథములో ముఖ్యముగా "చిత్తశుద్ధి, అర్థ నైర్మల్యము, నిందారాహిత్యము గోచరించుచున్నవి" అన్నారు డాక్టర్ జి. వి. కృష్ణారావుగారు "ఇందులోని రచనావిధానము శిష్టవ్యావహారికంలో సొగసుగా ఉంది" అన్నారు మహాకవి దాశరథిగారు. "ఆంధ్రాభ్యుదయమునందలి వ్యాసములన్నియు తెలుగు సాహిత్యసంపదను పెంపొందజేయునవిగా నున్నవని చెప్పుటలో సందేహములేదు" అన్నారు గోలకొండ పత్రిక సంపాదకులు శ్రీ నూకల నరోత్తమరెడ్డిగారు. "ఇందలి వ్యాసములన్నియు

గోలకొండ పత్రికలో ప్రకటితమైనవి. ప్రాచీన, ఆధునిక సాహిత్యము లందు రచయితకు గల ప్రవేశమునకు, అభిమానమునకు, ఈ వ్యాస ములు తార్కాణముగా నున్నవి" అన్నారు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు.

## కవిరాజు జీవితము – సాహిత్యము

"కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారు ధర్మమును రమ ణీయముగా ప్రవచించినకవి. ఆయన భగవంతుని పేర జరుగు పళయము లను నివారింపబూనిన నీతిశాలి. పరిమితమైన ధర్మమును వాడుకకు తెచ్చి, పురాణములలోని అధర్మమును బట్టబయలు చేసిన సత్యవాది. హైంధవ సంస్కృతిని యదార్థదృష్టితో పరిశీలించిన ధర్మవేత్త. అట్టి రామస్వామి చౌదరిగారి శిష్యులై 'జ్ఞాతిశ్చేదనలేనకిమ్' అను సూక్తిని కల్లజేయుచూ, వారి జీవితచరిత్రమును మిక్కిలి మనోహరముగా రచించినారు. ఇందులో మొదట రామస్వామిగారి జీవితమును చిత్రించి నారు. పిదప వారు రచించిన యొక్కొక్క సాహిత్య ప్రక్రియనుగూర్చి యొక్కొక్క అధ్యాయమును వ్రాసినారు. ఈ సాహితీ ప్రక్రియా విచారమునకు పిదప కవితా పరామర్శ, తాత్త్వికదృష్టి యను మఱి రెండు అధ్యాయములను చేర్చినారు. ప్రతిభాగమునందును కవిరాజుగారి వ్యక్తిత్వమును గూర్చియూ, సాహితీ వ్యాసంగమునుగూర్చియూ విజ్ఞులు, పత్రికలు వెలువరించిన యభిప్రాయములను జోడించినారు. శైలి సరళ మైన శిష్ట వ్యావహారికము. ఇది చారిత్రకదృష్టితో సాధికారముగా వ్రాయబడిన విమర్శనాత్మక గ్రంథరాజము. *"ఇందులో సుబ్బారావు గారు చేసినది చారిత్రకవిమర్శ ఇది ప్రాచీనులకు తెలియనిది. పాశ్చాత్య

---

*భారతి-సాహిత్య మాసపత్రిక — ఫిబ్రవరి, 1965.

వాననగలది. చారిత్రక విమర్శ యనగా సాహిత్యావతరణమునకు మూలములైన లౌకికకారణములను కనుగొనుట — కవి పుట్టిపెరిగిన సంఘము, ఆనాటి సామాజికశక్తులు, ఆ శక్తులు కవిమీద పనిచేసిన తెఱగు, తత్ఫలితముగా కవి పొందిన దీప్తి, ఆ దీప్తి ఆ కవి రచనలలో ప్రతిఫలించిన తీరు మున్నగునవన్నియు చారిత్రక విమర్శలోని మహాంగములు. రామస్వామి చౌదరిగారి సాహిత్యమునకు సంబంధించిన ఈ మహాంగముల పరామర్శయే ఈ గ్రంథములో బహుళము "సుబ్బారావుగారు రచించిన కవిరాజు జీవితము - సాహిత్యము చదువునప్పుడు బాస్వెల్ వ్రాసిన జాన్సన్ జీవితచరిత్ర జ్ఞాపకమునకు వచ్చుచుండును" అన్నారు శ్రీ ఆవుల సాంబశివరావుగారు.

"'కవిరాజు జీవితము-సాహిత్యము' జీవిత చరిత్రలలో తురాయి వంటిది" అన్నారు డాక్టర్ సి. నారాయణరెడ్డిగారు

*"కవిరాజుగారిని ఆంధ్రలోకమునకు ప్రప్రథముగా తెల్పిన ఖ్యాతి సుబ్బారావుగారిదే" అన్నారు పండిత గొట్టిపాటి వెంకట సుబ్బయ్యగారు.

## గోపీచంద్ జీవితచరిత్ర

ఉత్తమ కథా రచయితగా, నవలాకారుడుగా, తత్త్వవేత్తగా ఆంధ్ర సాహిత్యాకాశములో మూడు దశాబ్దములు జాజ్వల్యమానముగా ప్రకాశించిన ప్రతిభాశాలి శ్రీ గోపీచంద్‌గారు. ఆంధ్ర సాహిత్య క్షేత్రములో చెఱగని ముద్రవేసిన గోపీచంద్‌గారి బహుముఖశేముషిని

---

*12-1-1964 ఘంటసాల నుండి వ్రాసిన లేఖ.

అంశతః వింగడించి గ్రంథరూపములో అందించిన కీర్తి తొలిసారిగా సుబ్బారావుగారికే దక్కినది. గోపీచంద్ పకపకా నవ్వినప్పుడు, నింగి వైపు చూపులు రువ్వినపుడు, నలుగురిలో పలికినపుడు, నాలుగుగోడలు మధ్య నలిగిపోతూ గుండెపొరలు విప్పి చెప్పినపుడు, పిన్న విషయములు, కనుగొన్న అనుభవములు, ఎంతో అందముగా ఈ గ్రంథములో పొందిచేశారు సుహృన్మణి సుబ్బారావుగారు. "ఆంధ్రము నందలి విమర్శనాత్మకములైన జీవితచరిత్రలలో దీనికివిశిష్టమైన స్థానముగలదు" అన్నారు ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆంధ్ర శాఖాధ్యక్షులు ఆచార్య దివాకర్ల వెంకటావధానిగారు.

గోపీచంద్‌గారి బహుముఖ వ్యక్తిత్వమును పనసతొన తొలిచినట్లు చూపుతున్నదీ గ్రంథము. "ఆయన మౌలిక రచనలలోని పూర్వాపరాలకు నిలువుటద్దము వంటిదీ గ్రంథము." అన్నారు నవ్యాంధ్ర మహాకవి డాక్టర్ సి. నారాయణరెడ్డిగారు.

"మీరు రచించిన గోపీచంద్ జీవితచరిత్ర చదువుచున్నంతసేపూ గోపీచంద్ పుటలనుండి తొంగిచూస్తూ. నన్ను పలకరిస్తున్నట్లుగానే ఉన్నది" అన్నారు సుప్రసిద్ధ రచయిత, ఆంధ్రజ్యోతి సంపాదకులు శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారు.

"కవిరాజుగారు, గోపీచంద్‌గారు నా యెఱుకలోనివారైనను మీ సమీక్షవలన నే నెఱుఁగని విషయములెన్నో తెలుసుకొంటిని. మీ పరిశ్రమము కొనియాడఁదగినది. మీ పలుకు తెల్గువాని గుండెకు సూటిగా తాఁకుచు ఒక విశిష్టతను చాటుచున్నది. మీది సజీవమగు వ్యావహారికభాష. మీరు సత్యమును విడువని విమర్శకులు" అన్నారు అభినవతిక్కన, కళాప్రపూర్ణ శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారు.

## హరి పురుషోత్తం జీవిత చిత్రణ

హరిపురుషోత్తముగారు ప్రఖ్యాత నాటకకర్తగా, సంఘసంస్కర్తగా, కవిగా, అష్టావధానిగా, ఉత్తమోపాధ్యాయులుగా, భగవద్భక్తులుగా సంఘమున కమూల్యమైన సేవ చేసినారు. అట్టి హరిపురుషోత్తముగారి జీవిత సాహితీవిశేషములను సుబ్బారావుగారు హృదయంగమముగా చిత్రించినారు. ఇందులో మహామంత్ర శాస్త్రవేత్త హరిబుచ్చయ్యగారి లీలలు, లక్ష్మీవతిగారికీ, గరుడపక్షికీ గల సంబంధము మొదలైన సంఘటనలు చదువుటకు ఆసక్తిజనకముగా నున్నవి

మరుగుపడిన మాణిక్యమైన అష్టావధాని హరిపురుషోత్తముగారిని గూర్చి సుబ్బారావుగారు వ్రాసిన వ్యాసములు ధారావాహికముగా గోలకొండ పత్రికలో ప్రకటింపబడినవి ఈ విధముగా హరిపురుషోత్తముగారిని వెలుగులోనికి తీసుకొనివచ్చిన కీర్తి సుబ్బారావుగారికే దక్కినది. "జీవిత చరిత్ర రచన ఒక అసిధారావ్రతము. అట్టిదానిని సుబ్బారావుగారు క్రీడాప్రాయముగా నిర్వహించినారు" అన్నారు పాటిబండ మాధవశర్మగారు.

ఈ గ్రంథమును శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయములో డాక్టర్ దివాకర్ల వేంకటావధానిగారు ఆవిష్కరించినారు.

## నవ్యాంధ్ర కవిబ్రహ్మ జీవిత చరిత్ర

ఆంధ్ర సాహితీక్షేత్రములో తన కలమేహలనుగా రసవత్కవితా కేదారములు పండించిన కవిహాలికుడు ఏటుకూరి వేంకటనరసయ్యగారు. వారి జీవిత-సాహిత్యములను గురించి చక్కని సమీక్షాగ్రంథమును

వ్రాసినవారు సుబ్బారావుగారు. 1969-70 సం॥లో ఈ గ్రంథ ప్రచురణకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు రు. 1,000/— లు నొసంగి సుబ్బారావుగారిని ప్రోత్సహించినారు. 1970 సం॥లో కవిబ్రహ్మ జీవితచరిత్రను ప్రకటించి, ఆంధ్ర సరస్వతికి కంఠాభరణముగా నలంకరించినారు. కళాప్రపూర్ణ డాక్టర్ గిడుగు వెంకటసీతాపతిగారు "వేంకట నరసయ్యగారి జీవితములోని పడుగుపేకలను, వెలుగునీడలను చిరంజీవి సుబ్బారావు చాలా సిశితంగా చిత్రించారు. వారి రచనలను గురించి సుబ్బారావుగారు చేసిన పరిశోధన అమూల్యమైనది. వారి పరిశోధనాత్మక వివరణలు పరాకాష్ఠనందుకొన్నాయి. ఈ గ్రంథరచనకు పూనుకోవడముద్వారా సుబ్బారావుగారు ఆంధ్ర సాహిత్యమునకు గణనీయమైన సేవచేశారు" అన్నారు.

కళాప్రపూర్ణ, మహాకవి, పద్మశ్రీ బోయి భీమన్నగారు "మీ రచనలన్నీ చూచినతరువాత-ఇప్పుడు కవిబ్రహ్మ జీవితచిత్రణ, సాహిత్యసమీక్ష చదవడం కమ్మని విందు తర్వాత కప్పురపు విడెము సేవించినట్లున్నది" అన్నారు.

## కవిరాజు లేఖలు - డైరీలు

1914 వ సం॥ నుండి 1917 సం॥ వఱకు విదేశములనుండి కవిరాజు రామస్వామిగారు వ్రాసిన లేఖలను వీరు యెంతయో శ్రమించి సేకరంచినారు. వారి డైరీలనుకూడా సంపాదించినారు. "కవిరాజులేఖలు-డైరీలు" అను ఈ పరిశోధనాత్మక గ్రంథము సారస్వత పరిశోధనా మార్గములో మరొక మైలురాయివంటిది. ఈ లేఖలు-డైరీల వలన రామస్వామిగారు వారి జీవితకాలములో నెదుర్కొన్న గాలివినురులు, తుఫానులు, అనుభవించిన కష్టములు, ఆనందవిషాదములు మనస్సును



కవిరాజు లేఖలు-డైరీలు, కృతిపతి వ్యవసాయ శాఖామాత్యులు
శ్రీ కాకాని వెంకటరత్నంగారు



సుబ్బారాయ విరచిత గ్రంథావిష్కరణ మహోత్సవంలో ఉపన్యసిస్తున్న శ్రీ పాటిబండ మాధవశర్మగారు. కూర్చున్నవారు శ్రీ సుబ్బారావుగారు డాక్టర్ దివాకర్ల వేంకటావధానిగారు, అష్టావధాని హరిపురుషోత్తంగారు, శ్రీ నర్రా కోటయ్యగారు, డాక్టర్ అరిపిరాల విశ్వంగారు.

మలిచివేసిన ఆప్యాయతలు, అనురాగములు, ఆదర్శములు, ఆంతర్యములు, అనుభూతులు ద్యోతకమౌతాయి. ఈ లేఖలు-డైరీలు ఆనాటి సామాజిక వ్యవస్థకు దర్పణమువంటివి. వీనిలోని ప్రతిసన్నివేశము, సంఘటన కాలగర్భములో కలిసిపోయిన మధురస్మృతులను జ్ఞప్తికెలయించుచున్నవి. 'ఈ లేఖలు-డైరీలు' కవిరాజు రామస్వామిగారిని గురించి,ఆయన వ్యక్తిత్వపు వైశిష్ట్యమును గురించి అమూల్యమైన విషయములనువెల్లడించు చున్నవి. శ్రీ సుబ్బారావు కేవలము రచయితగానే గాక, ఈ గ్రంథ ప్రచురణతో పరిశోధకులుగా కూడా గోచరించుచున్నారు" అన్నారు ఆస్థానకవి, పద్మభూషణ, కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు.

1956వ సం॥ నుండి 1966 సం॥ వఱకూ ఆంధ్రప్రభ, ఆంధ్ర జ్యోతి, గోలకొండ దినపత్రికలలో ప్రచురింపబడిన సుబ్బారావుగారి సాహిత్య వ్యాసములు, దక్కన్ క్రానికల్‌లో ప్రకటింపబడిన సంక్షిప్త జీవిత చిత్రణలు సమకాలీన పండిత కవులదృష్టి నాకర్షించినవి. వారిని ఆలోచనానిమగ్నులను చేసినవి.

## రేడియో ప్రసంగములు

ఆకాశవాణి హైదరాబాదు కేంద్రమునుండి సుబ్బారావుగారు రచించిన అనేక రూపకములు, కథానికలు, ప్రసంగములు, ప్రసారము చేయబడినవి. గాంధీజీ శతజయంతి సందర్భములో వీరు ప్రత్యేకముగ గాంధీజీని గురించి - మహాత్ముడు – సాంఘికాభివృద్ధి, మహాత్ముడు – గ్రామస్వరాజ్యము, గాంధీజీ చూపిన వెలుగుబాట - నిరాడంబరత మొదలగు ప్రసంగములను చేసినారు. బంజారీలను గురించి వీరి

పరిశోధనాత్మకమైన రేడియోప్రసంగము 4-2-1971 న వెలువడినది. వీరు రచించిన "యాత్రాస్థలములు - నాగార్జునసాగర్", కొత్తదారి, ఉగాది, విజయదశమి మొదలైన రూపకములు ఆకాశవాణి నుండి ప్రసారము చేయబడినవి. అసంఖ్యాకమైన శ్రోతల ప్రశంసల నందుకొనినవి.

వీరు రచించిన కథానిక "శిక్షలేని నేరం" సాహిత్యనందిని కార్యక్రమములో (27-9-1968) ప్రసారము చేయబడినది. ఎందరో మహానుభావులు అను శీర్షికక్రింద 'గిడుగు రామమూర్తి' పంతులుగారిని గురించి వీరు చక్కని ప్రసంగము (28-9-1971) చేసినారు. చైనా వాడు మనదేశముపై దండయాత్ర చేసినప్పుడు సుబ్బారావుగారు దేశ ప్రజల నుత్తేజపరచుటకు 'దేశం కోసం' అనే చక్కని కథానికను వ్రాసినారు. అది ఆంధ్రప్రదేశ్ మాసపత్రికలో ప్రచురింపబడినది. ఆంగ్లమునుండి కొన్ని కథానికలను తెలుగులోనికి అనువదించినారు.

## జీవిత చరిత్ర రచనలలో సిద్ధహస్తులు

జీవితచరిత్ర రచనకు గమనార్హమైన ముఖ్యాంశములను వాస్తవముగను, ఉదాత్తముగను సేకరింపబడినప్పుడే, అట్టి రచన ఆ మహావ్యక్తియొక్క జీవితవిశేషములు, ప్రజాబాహుళ్యమునకు మార్గదర్శకములై పాఠకులను ప్రభావితులను చేయగలదు. ఈ దృష్టితో పరిశీలించినప్పుడు. *జీవిత చరిత్ర రచనకు పూనుకొనెడు రచయితకు ముఖ్యముగా వ్యక్తి జీవితాంశములపై శాస్త్రీయ దృక్పథము, సేకరించిన విధానాంశములను చెప్పెడుతీరులో కళాత్మకమైనదృష్టి కలిగియుండుట

* Principles of Biography – Sidney Lee



ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రంనుండి ప్రసంగిస్తున్న శ్రీ సుబ్బారావుగారు
పర్యవేక్షిస్తున్న శ్రీ యన్. వి. యస్. ప్రసాదరావుగారు



శ్రీ సుబ్బారావుగారిచే రచింపబడిన మహామనీషుల జీవిత చరిత్రలను నిశితముగా పరిశీలించి, వారి పరిశోధనాత్మకమైన రచనా శిల్పి వైదుష్యమును గుర్తించి, 'విమర్శకరత్న' బిరుదును ప్రసాదిస్తున్న కవిసింహ బ్రహ్మశ్రీ పోకూరి కాశీపత్యవధానులుగారు, బిరుదు స్వీకరిస్తున్న శ్రీ సుబ్బారావుగారు

అవసరము - అనగా జీవితచరిత్రను వ్రాయు రచయిత విశిష్టమైన సాహితీ శాస్త్రజ్ఞుడుగను, సాహితీ శిల్పకళాకోవిదుడుగను, నుండవలెను. అప్పుడే జీవితచరిత్ర ఆ మహావ్యక్తియొక్క వ్యక్తిత్వమును యథాతథముగ చిత్రించునదియై, ఉత్తమ రచనగా పేర్కొనబడి, జీవితచరిత్ర రచనాలక్ష్యమును సాధింపగలదు. జీవితచరిత్ర సార్థకత పొందుట కిదియే గీటురాయి.

జీవితచరిత్రలను వ్రాయు రచయితకు వుండవలసిన సామర్థ్యమును, కళానైపుణ్యమును గురించి *The Art of the Biographer అను వ్యాసములో ఏ. సి. బెన్సన్ "జీవిత చరిత్రను వ్రాయు రచయిత నిర్విరామమైన కృషిచేయ గలిగి యుండవలయును. విషయ పరిశీలన యందు నిశితమైన దృష్టిని గలిగి యుండవలయును. విషయములను సమగ్రముగా తీర్చిదిద్దగల విన్నాణము గలిగి, పరిశోధన చేయవలయును. జీవితములోని విషయ పరిగ్రహణములో ఔచిత్యానౌచిత్యములను గుర్తించి, రచనలో వైవిధ్యమును, నిష్పాక్షికతను, సభ్యతను ప్రకటించి, అభిమానమును, ఊహాచిత్రణను విడనాడవలయును" అని నుడివినాడు.

ఈ దృష్టితో జూచిన యెడల శ్రీ సుబ్బారావుగారిలో పై పేర్కొనిన లక్షణములన్నియూ పుష్కలముగా నున్నవి. వారు ఆంధ్రాంగ్ల భాషల యందలి జీవిత చరిత్రలన్నియూ క్షుణ్ణముగా పఠించినారు.

"ఆంగ్ల భాషయందలి మీరు చదివిన ఉత్తమ జీవితచరిత్రలు కొన్ని చెప్పగలరా?" అని ప్రశ్నించితిని.

---

* Six short Biographies - R C & N. Goffin.

సుబ్బారావుగారు మంద స్మితవదనముతో "ఆంగ్ల వాఙ్మయ చరిత్రలో బాస్వెల్ రచించిన జాన్సన్ జీవిత చరిత్ర అత్యుత్తమమైనదిగా గుర్తింపబడినది. ఆంగ్ల సాహిత్యములో ఉత్తమ జీవిత చరిత్రలుగా గుర్తింపబడిన వానిలో-మాసన్ రచించిన గ్రే జీవిత చరిత్ర, లాక్‌హర్ట్ రచించిన స్కాట్ జీవిత చరిత్ర, కార్లైల్ రచించిన స్టెర్లింగ్ జీవిత చరిత్ర, ట్రవెలియన్ రచించిన మెకాలే జీవిత చరిత్ర, ఫ్రౌడే రచించిన కార్లైల్ జీవితచరిత్ర, సేథే రచించిన నెల్సన్ జీవిత చరిత్ర, రోస్బరీ రచించిన పిట్టు జీవితచరిత్ర, మోర్లే రచించిన గ్లాడ్‌స్టన్ జీవిత చరిత్ర, లిట్టన్‌స్ట్రాచే రచించిన విక్టోరియా మహారాణి జీవితచరిత్ర, విన్స్టన్ చర్చిల్ రచించిన మార్లబరో జీవితచరిత్ర, ఫిలెప్‌గాడెల్లా రచించిన వెల్లింగ్టన్ ప్రభువు జీవితచరిత్రలు ముఖ్యముగా పేర్కొనదగినవి" అన్నారు.

"ఆంగ్ల సాహిత్యములోవలెనే ఆంధ్ర సాహిత్యమునందలి ఉత్తమ శ్రేణికి చెందిన జీవిత చరిత్రలు కొన్నింటిని చెప్పండి!"

"ఆంధ్ర సాహిత్యములో నున్న కొన్ని జీవిత చరిత్రలు కూడా సమగ్రమైనవి, శాస్త్రీయమైనవికావు. అందులకు కారణం, చారిత్రక దృక్పథం ఆంధ్రులలో అంతగా అలవడక పోవడమే. అందుచేత, ఉత్తమ శ్రేణికి జెందిన జీవిత చరిత్రలు, జాతిని ఉత్తేజపఱచ గలిగినవి, ఉత్సాహముగా పఠించదగినవి ప్రశంసార్హమైన పద్ధతిలో రచింపడినవి లభించుటలేదు. జాతిని జాగృతం చేసి, యుగ వైతాళికులుగా పేరు పొందిన మహాకవులు, మేధావులు, పండితులు ఎందరో యున్నారు. అయినప్పటికీ, మన దురదృష్టమో యనునట్లు, నేటివఱకూ ఆ మహా పురుషుల జీవిత చరిత్రలు సమగ్ర రూపములో వెలువడ లేదు. ఇదికడు శోచనీయము."

"సంపూర్ణము, సమగ్రము నయిన జీవిత చరిత్ర ఏ విధముగా నుండవలెనో కొంచెం వివరిస్తారా సుబ్బారావుగారూ?"

"ఉత్తమ జీవిత చరిత్రల రచనావశ్యకత నేడు యెంతయో కలదు. కనుక మహాపురుషుల జీవిత చరిత్రలు వ్రాయునప్పుడు, వారు జీవించిన కాలము, ఆ నాటి ఆచారవ్యవహారములు, ధర్మాధర్మములు, ఆనాటి రాజకీయ, సాంఘిక, ఆర్థిక స్థితిగతులు, వాని యందు ఆ మహా వ్యక్తులు ప్రభావితులైన తెఱగు, ఏ ఏ కవులు, రచయితలు వారిని ప్రభావితులను చేసినది-లేక-వారే ఆయా వ్యక్తుల జీవిత విధానము వలన ప్రభావితులైనది, ప్రజ్ఞావంతులుగా తీర్చిదిద్దబడినది మున్నగు విషయ ములను నిశితమైన చారిత్రక దృష్టితో పరిశీలించి వ్రాయవలయును. అట్టి జీవిత చరిత్రయే సంపూర్ణమైనదియు, సమగ్రమైనదియు, అని చెప్ప వచ్చును" అన్నారు సుబ్బారావుగారు.

"జీవిత చరిత్రలు పఠించుట వలన కలుగు ప్రయోజనమును గురించి మీ అభిప్రాయము ఏమిటండీ?"

"ఒక మహాపురుషుని జీవిత చరిత్రవలన గలుగు ప్రభావము ఇంతింతని చెప్ప జాలము. జాతిని జాగృతపఱచి, ఉత్తేజపఱచి, ధీశక్తి యుతులుగా రూపొందించ గల శక్తి మంతములైన జీవిత చరిత్రల పఠనము వలన కలుగు ప్రయోజనమును తక్కువ అంచనా వేయ జాలము. Of all studies, the most delightful and useful is biography.

మహాత్ముల జీవితములను అర్థము చేసికొని, వారి జీవిత సాహిత్యములలోని విలువలను, వైశిష్ట్యములను గ్రహించి, వారి వ్యక్తిత్వ

ములను ఆదర్శముగా గైకొని, చైతన్యవంతులు, ప్రతి భావంతులుగా కావలసిన యువతరమును సంఘటిత పఱచి, ఒక జాతిగా కూర్చి, ఒక శక్తిగా తీర్చి, దేశ సౌభాగ్యమునకు కృషిచేయవలయుననిన యెడల, ఆ లక్ష్య సాధన ఒక్క జీవిత చరిత్రల పఠనము వలననే కలుగునని నా దృఢ విశ్వాసము" అన్నారు సుబ్బారావుగారు.

"జీవిత చరిత్రల రచనా ప్రక్రియలోనే మీరు కృషి చేయుటకు గల కారణములను కూడా చెబుతారా ?"

''వివిధ సాహిత్య ప్రక్రియలలోను – నవల, నాటిక, కథానిక, కవితలలో మంచి రచయితలు, కవులు ఉన్నారు మనకు. జీవిత చరిత్రకారులుగా పేర్కొనదగినవారు చాలకొద్దిమంది మాత్రమే. గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారు కొన్ని జీవిత చరిత్రలు వ్రాసినారు. కొన్నింటిని నేను వ్రాసినాను. ఈ సాహిత్య ప్రక్రియలో పోటీపడువారి సంఖ్య బహుస్వల్పము. జీవితములోని కొన్ని ముఖ్య సంఘటనలతో పాటు, ఆయా రచయితల, కవుల, సాహిత్యకృషిని కూడా జోడించి నేను వ్రాయుచున్నాను. జీవిత చరిత్ర రచనకు నేను నూతన రూపు రేఖలు దిద్దినా ననుచున్నారు ప్రముఖ సాహితీవేత్తలు. అందుచేత ఈ సాహిత్యప్రక్రియలోనే అవిరళ కృషిచేయవలెనని నిశ్చయించుకున్నాను. 'Jack of all trades and master of none' అని అనిపించు కోవడము కంటే, ఈ ప్రక్రియలలోనే సిద్ధహస్తులనిపించుకొనడము మంచిదని నా యభిప్రాయము."

నిరంతర, నిర్విరామకృషితో, బహుక్లేశములతో కూడిన జీవిత చరిత్రలు వ్రాయుటకు కావలసిన యదార్థ విషయములను సేకరించుట

లోను, వానిని సర్వజనామోదకరమైన శైలిలో నందించుటలోను సుబ్బా రావుగారు సిద్ధహస్తులు.

## సద్విమర్శకులు

శిష్ట వ్యావహారిక భాషలో సొగసుగా జీవిత చరిత్రలను వ్రాయ డమేగాక, సుబ్బారావుగారు వివేచన గలిగిన విమర్శకులు కూడా. "ఒక వ్యక్తియొక్క మహిమాన్వితమైన వ్యక్తిత్వమును చిత్రించునప్పుడు ధీరచిత్తుడై ఆ వ్యక్తి చేసిన సాహసోపేతమైన కృత్యములను అతిప్రాధా న్యముగా పేర్కొనిన వారే మంచి విమర్శకులు" అని, 'అనటోల్ ఫ్రాన్స్' విశదీకరించినాడు. శ్రీ సుబ్బారావుగారి విషయములో యిది అక్షరశః యదార్థము. మహాకవుల సాహితీ గ్రంథములను, వారి జీవిత ములను రచించునప్పుడు, విశేషములను విశ్లేషించి విశదీకరించునపుడు తులనాత్మకముగ పరిశీలించి, ఆ మహావ్యక్తియొక్క ప్రతిభను యథా తథముగా వీరు ప్రశంసించుట కన్పించును. విమర్శయనగా రచనలం దలి దొనగులను ఎత్తిచూపుట యను భావము ప్రబలియున్నది. అది సరియైన విమర్శనా దృక్పథము కాజాలదు. *Carlyle said "Criticism stands like an intrepreter between the inspired and the uninspired; between the prophet and those who hear the melody of his words, and catch some glimpse of their material meaning, but understand not their deeper import." —ఆంగ్లములో ఒక గ్రంథము వెలువడగానే దానిని ప్రశంసించుచూ విమర్శలు కోకొల్లలుగా వెలువడును. ఆంగ్ల భాషా సంప్రదాయము ననుసరించి సుబ్బారావుగారు 'Critical appreciation' చేయుచున్నారు. వ్యక్తిగతమైన విమర్శలకెంతమాత్రము వీరి రచనలలో

*An introduction to English Criticism—By Sri B. Prasad.

తావులేదు. కవి ప్రయోగించిన పదములను, సూక్తులను నుదహరించి, కవియొక్క పాండితీ ప్రతిభను కళాత్మక, సృజనాత్మక, వాగ్విలాస లాస్యరీతులను లోక హితముగా విదితము గావింతురు. ఇది వీరి జీవిత సాహితీ చరిత్ర రచనా పద్ధతి. వీరు ఏ ఒక్క కవిని గురించి గాని, రచయితను గురించిగాని ప్రతిఫలాపేక్షతో వారి జీవిత చరిత్రను వ్రాసి యుండలేదు. సాహితీ క్షేత్రములో నిష్కాముతైన యభ్యుదయ హాలికులు శ్రీ సుబ్బారావుగారు. క్లిష్టమైన శబ్దాడంబరముతో, ఛందో బద్ధమైన బిగింపులతో, వ్యాకరణాలంకార ప్రయోగములతో, సులభ గ్రాహ్యముగాక, పండితులకే గ్రాహ్యముకాగల నారికేళపాకము వంటి శైలితో, బహుళముగా వ్యాప్తిలోనున్న సాహితీ కావ్యవస్తు పదకోశ మును, ద్రాక్షా పాకముగాజేసి, ధారావాహినిగా మార్చి, భావమును తఱచి, పదములను విడిచి, పాఠకులకు సులభగ్రాహ్యమగు శైలిలో రచింపగల ప్రతిభావ్యుత్పత్తులు గలవారు శ్రీ సుబ్బారావుగారు. మహా మనీషుల జీవిత, సాహితీ విమర్శలతో, రసానుబంధ బంధురమైన, విజ్ఞాన, వినోదాత్మకమైన సాహితీ స్రవంతులను తన దివ్యలేఖిని నుండి ప్రవహింపజేయగలిగిన విమర్శకులు శ్రీ సుబ్బారావుగారు. వీరిది భగీరథ ప్రయత్నము. ఈ ప్రక్రియలో వీరిదే ప్రథమ తాంబూలము.

''విమర్శకున కుండవలసిన లక్షణములను వివరించండి!''

"(1) భావుకత, (2) నిష్పాక్షికత, (3) నిజాయితీ, (4) నిరంతర కావ్య పఠనము, (5) చారిత్రిక దృక్పథము — ఇవి ముఖ్యముగా విమర్శకున కుండవలసిన లక్షణములు" అన్నారు సుబ్బారావుగారు.

31

## తాత్త్విక జిజ్ఞాసువు

మానవునికి జ్ఞానమంకురించిన నాటినుండి తాత్త్విక దృక్పథ మేర్పడుచున్నది. ఆలోచన కల్గడము మొదలుపెట్టగానే ఈ జీవిత మేమిటి? ఈ చుట్టూనున్న ప్రపంచమేమిటి? మనమెచ్చటి నుండి వచ్చితిమి? ఎచ్చటికి పోవుదము? మరణమే జీవితమునకు అంతమా? లేక మరణానంతరము జీవికి 'పునర్జన్మ' కలదా? సృష్టికర్త యొకడున్నాడు? ఉన్నట్లయితే కొందరు దుర్మార్గులు సుఖపడుటెందులకు? కొందరు సన్మార్గులు దుఃఖపడుటెందులకు? అను ప్రశ్నలు నాటినుండి నేటి వరకూ మానవుని చింత నాసక్తుని చేయుచునేయున్నవి. సత్యాన్వేషణకు పురిగొల్పుచునేయున్నవి.

విద్యార్థి దశనుండి సుబ్బారావుగారుకూడా ఈ ప్రశ్నలతో సతమతమగుచూ నుండెడివారు. సరియైన సమాధానములు పొందుటకు, ప్రయత్నించినారు. 'భారతీయ తత్త్వశాస్త్రము'ను చదివినారు. కొన్ని ఉపనిషత్తులనుకూడా అధ్యయనము చేసినారు. పాశ్చాత్య వేదాంతుల జీవితములను, వారి సిద్ధాంతములను తెలిసికొనవలయునను జిజ్ఞాసతో 'Biographies of great philosophers' అను గ్రంథమును, ప్రాక్పశ్చిమ తత్త్వ శాస్త్ర చరిత్రలను చదివి ఆకళింపు జేసికొనినారు. రామకృష్ణ పరమహంస, వివేకానందుల రచనలను కూడా చదివినారు. ఎం. ఎన్. రాయ్ వ్యాసములను, 'Materialism' అను గ్రంథములను గోరాగారి 'నాస్తికత్వమును', బెర్ట్రండ్ రస్సెల్ రచించిన 'The problems of philosophy' అను గ్రంథములను పరిశీలించినారు. ఎన్ని తాత్త్విక గ్రంథములు చదివినను సందేహములు నివృత్తికాలేదు. షడ్దర్శనములు – (గౌతముని) న్యాయ, (కణాదుని) వైశేషిక, (కపి

లుని) సాంఖ్య, (పతంజలి) యోగ, (జైమిని) పూర్వమీమాంస, (వ్యాసుని) ఉత్తర మీమాంస సిద్ధాంతములను పఠించినారు. "Life after death", "The Soul of a Man" అను గ్రంథములను శ్రద్ధగా చదివినారు. భగవద్గీతను పారాయణ గ్రంధముగా పఠించినారు. కాని సుబ్బారావుగారి మేధస్సులో ప్రశ్నల పరంపరలు రేగు చునే యున్నవి.

తాత్త్వక జిజ్ఞాసతో సుబ్బారావుగారు అనేక మంది స్నేహితుల తోను, వేదాంతులతోను చర్చలు సాగించినారు. ఎవరెన్ని విధముల సమాధానములు చెప్పినప్పటికి వానినన్నింటిని, తన హేతువాద దృక్ప థముతో పరిశీలించి యొక నిర్ణయమునకు రాగలిగినారు. సృష్టి, స్థితి, లయములకు కారణమైన దృగ్గోచరము కాని యొక మహాశక్తి కలద నియు, ఆ శక్తి యొక్క విశ్వవ్యాపనమే ఈ యనంతమైన సృష్టియ నియు సుబ్బారావుగారి యుద్దేశము. ఈ చరాచరమైన సృష్టికేది మూలకారణమో, అది మునీశ్వరులకుకూడా అగోచరమైన దొడ్డ వెలు గనియు, దానిని మానవుడు ఆశ్రయించునట్లు జేయుటకు ప్రపంచము లోని చెడును, మోసమును నిర్మూలించవలసిన అవసరము కలదనియు, ఈ మాయాజాలమును నిర్మూలించ గలిగినప్పుడే ఆ 'దివ్యజ్యోతి' యొక్క ప్రభావమును మానవుడు సరిగా స్వీకరించగలడనియు సుబ్బా రావుగారి విశ్వాసము.

మానవజీవిత మొక ఆదర్శమును కలిగి యుండవలయునని సుబ్బారావుగారి యభిప్రాయము. మానవుడు దుష్టస్వభావమును వదలు కొని, నీతిని, సత్యమును నమ్మి, జీవితము గడిపిన యెడల, స్వచ్ఛ ముగా, నిర్మలముగా వెలుగుచున్న జ్యోతిని చేరుకొనుట కర్తవ్యతగల్గు



కవిరాజు జీవిత చరిత్ర కృతిపతి, సాహితీ వల్లభ
శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజుగారు



గోపీచంద్ జీవిత చరిత్ర కృతిస్వీకర్త జస్టిస్
శ్రీ ఆవుల సాంబశివరావుగారు



నవ్యాంధ్ర కవిబ్రహ్మ శ్రీ ఏటుకూరి వెంకటనరసయ్యగారి
జీవిత చరిత్ర కృతిపతి, సుబ్బారావుగారి మిత్రవర్యులు,
సాహితీ ప్రియులు, వ్యాపార దక్షులు శ్రీ నర్రా కోటయ్యగారు

ననియు, ఆ విధముగా జేరుకొనుటయే మానవుని యాదర్శమనియు వారు తలంచినట్లుగా కన్పించుచున్నది.

మానవుల సుఖదుఃఖములకు ముఖ్య హేతువులు వారి సుకృత, దుష్కృతములని వీరి నిశ్చితాభిప్రాయము. సుకృత, దుష్కృతముల శేష ఫలితమే 'పునర్జన్మ'కు కారణభూతమని సుబ్బారావుగారి విశ్వాసము.

*'పునర్జన్మ'ను గూర్చి పాశ్చాత్య దేశములో పరిశోధనలుజరుగుచున్నవి. అనేక సంవత్సరములు పరిశోధనలు జరిపిన అమెరికన్ శాస్త్రవేత్త 'అయాన్‌స్టీ వెన్‌నన్' మరణానంతరము జీవితం ఉండవచ్చునను నిర్ధారణకు వచ్చినాడు. తమ పూర్వజన్మను గూర్చి జ్ఞాపకం పెట్టుకొననివారిలో అధిక సంఖ్యాకులు చిన్న పిల్లలేనట. పూర్వజన్మలో తాము నివసించిన గృహములున్న చోటు, జన్మస్థలం, తమ తల్లిదండ్రుల, స్నేహితుల పేర్లు వారు చెప్పగలిగినారు.

స్వర్గ, నరకములు అను రెండును ఊహాజనితము లనియు, వీని ధ్యేయము ప్రజలను ఋజువర్తనులుగా నడిపించుటకు మేధావి వర్గము కల్పించిన అభూతకల్పన యనియు వీరి ప్రగాఢ విశ్వాసము.

కలిమిలేముల వలననే సుఖదుఃఖములు కల్గుచున్నవనియు, సుఖమున కాలవాలమైనదే స్వర్గమనియు, దుఃఖభూయిష్టమైనదే నరకమనియు ఈ రెండును ప్రతివారి జీవితములో కలవనియు, నందుచేత ప్రతియొక్కరు జీవితమునకు కావలసిన జ్ఞానమును సముపార్జించుకొనవలయుననియు, ధర్మార్థ కామములను, వలసిన రీతిలో అనుభవించి, జీవి

---

*ఆంధ్రప్రభ అక్టోబరు 24, మంగళవారం 1972

తాంతమున లౌకిక బాధ్యతలను తమ వారసులకు సంక్రమింపజేసి, అవసాన దశలో 'శాంతి'ని పొందుటయే 'మోక్ష'దాయక మనియు సుబ్బారావుగారికి గల తాత్త్విక దృక్పథము.

## వ్యక్తిత్వము

తత్త్వజిజ్ఞాసువులై, చారిత్రక వాఙ్మయ కళాదీధితులను నిరంతర కార్యదీక్షతో కనగోరు పరిశుద్ధాత్ములకే పలుకు వెలఁది తన వెలుగు లందించును. శ్రీ సుబ్బారావుగారు శాంతమూర్తులు. వారి కన్నులలో ప్రేమామృతము వెల్లివిరియు చుండును. సత్యధర్మ సాక్షాత్కారమును పొందుగోరుటయే వారి చిర లక్ష్యము. నిండుకుండ వంటి హృదయముతో, పండు వెన్నెలను ముఖమునందు చిందించుచుండు శ్రీ త్రిపురనేని సుబ్బారావుగారు, తమ విమర్శక ప్రజ్ఞను వారి గ్రంథములయందు ప్రతిఫలింప జేసినారు. అతి లలితమైన శైలిలో పదునుగల తెలుగు నుడుల కదను త్రొక్కించుచు, నుచితగతి నొక్కొక్కచో కావ్యకథలను విప్పి చెప్పుచు, నింకొక్కచో దదంతర్గత పరమోదాత్త భావ తటిత్తులను ప్రస్ఫుటింప జేయుచు, నచ్చటచ్చట ఆయా కవుల పద్యరత్నముల నుదహరించుచు, నెల్లయెడల నుత్తమ కవితా లక్షణముల నెత్తిచూపుచు, కావ్యగత లక్ష్యములతో పొందుపఱచుచు, అత్యంత రమణీయముగా విమర్శన గ్రంథముల నుల్లేఖించినారు.

కవీశ్వరునకుండు పరిణత, భావోపజ్ఞలేగాక, ఇంకను నాలుగాకులు నమలిన విశిష్ట శక్తి, నిశిత దృష్టి, సౌమనస్యము, విమర్శక ప్రవృత్తి యున కుండవలయును. ఆ శక్తులన్నియు గలవారు రావుగారు. వారి రసిక హృదయము కావ్య ప్రపంచపు టంచులను ముడివేసి, విడిచి

సారమును వెలిదీసి, తాము త్రాగినంత త్రాగి, పవిత్ర ప్రజాహృదయ ములకు పంచి పెట్టినది. వారికి బాల్యము నుండియు చారిత్రక సత్య మును, కావ్యసారమును, స్వాదుపాయసమును త్రాగునట్లుగా త్రాగుట యందు మక్కువ ఎక్కువ. వారి హృదయము రసజ్ఞులగు కవులను, పరిశోధకులను జూడగనే, చంద్రకర స్పర్శపొందిన సాగరమువలె పొంగి పోవుచుండును. కనుకనే ఈనాడు సుప్రసిద్ధ కవుల జీవిత – సాహిత్యములను చిత్రించవలయునను లక్ష్యమును సాధించుచున్నారు.

కప్పురంపు పలుకుల వంటి తెలుగు పదములతో, వస్త్వాకారము లను సూటిగా తేట పఱచుట శ్రీసుబ్బారావుగారి రచనలోగల పసందు. పదాడంబరము కొరకు పాటుపడు రచయిత కాదు సుబ్బారావుగారు. అందుచేతనే సుబ్బారావుగారి రచనలలో సహజ సౌందర్య ముట్టిపడు చుండును. చక్కని భాషా జ్ఞానము, రచనా సామర్థ్యము, విమర్శనా శక్తిగల ఈ రచయిత జీవిత చరిత్రల రచనకు నూతన రూపకల్పన చేసినారు. వీరి గ్రంథములు మహావ్యక్తుల కంకితమీయబడినవి. 'ఆంధ్రాభ్యుదయము'ను సుప్రసిద్ధ విద్వాంసులు, సంఘ సంస్కర్త, గురువర్యులునయిన కీ॥ శే॥ త్రిపురనేనిగారి రామస్వామి దివ్యస్మృతికిని, కవిరాజు జీవిత చరిత్రను పరిశోధనకై అహరహము శ్రమించు సాహితీ వల్లభ శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజుగారికిని, గోపీచంద్ జీవిత చరిత్రను ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తులయిన శ్రీ ఆవుల సాంబశివరావు గారికిని, అష్టావధాని హరి పురుషోత్తముగారి జీవిత చిత్రణను కథా సాహిత్య సమ్రాట్, సుప్రసిద్ధ నవలా రచయిత, తత్త్వవేత్త, స్వర్గీయ గోపీచంద్‌గారి మధురస్మృతికిని, నవ్యాంధ్ర కవిబ్రహ్మ జీవితము, సాహిత్యమును, సాహితీప్రియులు, వాణిజ్య దక్షులైన శ్రీ వీర్రాకోటయ్య గారికిని, కవిరాజు లేఖలు – డైరీలు, అను పరిశోధనా గ్రంథమును,

స్వాతంత్ర్య సమర యోధులు, అకలంక దేశభక్తులు, వ్యవసాయశాఖా మాత్యులు అయిన శ్రీ కాకాని వెంకటరత్నము గారికిని అంకితమీయ బడినవి. వీరి సాహిత్య వ్యాసములు డాక్టర్ కె. రామనాధ్ చౌదరి గారికి అంకితమచ్చుటకు నిర్ణయించుకొనినారు సుబ్బారావుగారు.

## ఉద్యోగ నిర్వహణ

ఆంధ్రప్రదేశ్ సచివాలయములో 1964వ సం. నుండి ఆఫీసరు హోదాలో సుబ్బారావుగారు తమ బాధ్యతలను సక్రమముగా నిర్వహించుచు, నేబది మంది కవుల జీవిత, సాహిత్యములను తులనాత్మకముగా బరిశీలించి వ్రాయుచున్నారు. సుబ్బారావుగారు తమ పదవీ నిర్వహణలో కూడా అత్యంత సమర్థులు. 1961వ సం॥లో జనాభా లెక్కల సేకరణ సందర్భములో వారు చూపిన ఉత్సాహమునకు, లెక్కలు సక్రమముగా సేకరించినందులకు భారత రాష్ట్రపతి యొక తామ్ర పతకమును, నొక యోగ్యతా పత్రమును బహుకరించినారు.

సుబ్బారావుగారు కుశాగ్రబుద్ధులు. కుల, మత, ప్రాంతీయతత్వ పరవశమ్మునకు లోబడని ధీరచిత్తులు. స్థిర సంకల్పులు. నిష్పాక్షిక మైన, నిశితమైన, రససంభరితమైన, మనోజ్ఞమైన, త్రికరణశుద్ధిగల వారు. జీవిత సాహితీ రచనా వ్యాసంగమునందు ప్రతిభావంతులు; స్వార్థ సంకుచిత భావోన్మాదమున కతీతులు. కనుకనే వీరు మానవతావాద ప్రియులు. సత్యాన్వేషకులు, నిరాడంబరులు; ఇట్టి సద్గుణ తేజోవిరాజితులు గనుకనే వీరు రచించిన జీవిత చరిత్రలు పండిత కవుల ప్రశంసలందుకొనినవి.



శ్రీ సుబ్బారావుగారి 'వ్యానమంజరి' కృతిపతి
డాక్టర్ కె. రామనాథ్ చౌదరిగారు



డాక్టర్ యు. సి. కాంభోజియాగారు (గుజరాత్) హైదరాబాద్ వచ్చినప్పుడు
శ్రీ హరి లక్ష్మీపతిగారు, డాక్టర్ యు. సి. కాంభోజియాగారు, శ్రీ సుబ్బారావుగారు,
శ్రీ పురుషోత్తంగారు తదితర మిత్రులు.

## పండిత కవుల ప్రశంసలు

మహాకవి శేఖర, మాజీ గద్వాల ఆస్థానకవి, కవిసింహ కాశీపత్యవధానులుగారు సుబ్బారావుగారి కృతులను పరిశీలించి ఇట్లు "శుభాశీస్సు"ల నందించినారు.

శ్రీ భోగారోగ్యాయు
రైశ్వర్య సంతాన సౌమ్యవర్తన విద్యా
ప్రాభవములు హెచ్చుచుఁ దా
శోభిలు మిల త్రిపురనేని సుబ్బారాయా !

అతి భక్తిన్ సుకవుల జీ
వితములు గ్రంథములుగాగ విరచించిన నీ
కృతులనుగని జనములు నిను
స్తుతియింపరె త్రిపురనేని సుబ్బారాయా !

సుకవుల చారిత్రంబులు
ప్రకటించుట యనిన చిన్నపనిగాదు సుమా !
సుకృతములలోన నదియొక
సుకృతమె కద త్రిపురనేని సుబ్బారాయా !

వారక కవుల చరిత్రల
పారముగా సేకరించి ప్రకటింతువు త
త్కారణ జన్ముడవు గదా !
సూరివరా త్రిపురనేని సుబ్బారాయా !

బోధింతువు సూక్తుల నా
రాధింతువు గురువరేణ్యు రామస్వామిన్
సాధింతువు సాహితిఁ బరి
శోధింతువు త్రిపురనేని సుబ్బారాయా!

అకలంకాత్ముఁడవు విమ
ర్శకుడవు నిర్వ్యాజ కీర్తి సంయుతుడవు ధా
ర్మికుడవు కృతికర్తవు గద
సుకవిప్రియ త్రిపురనేని సుబ్బారాయా!

ఇంపౌనట్టుల నాంగ్లమందునను బీ. యే. పట్టభద్రుండవై
సొంపారీతి తెనాలి పట్టణమునన్ సూతాశ్రమంబందు రా
ణింపన్ దెల్గున నెన్నఁగాఁదగిన పాండిత్యంబు నార్జించి శా
సింపన్ గల్గితి వజ్జరే త్రిపురనేన్ శ్రీ సుబ్బరాయాగ్రణీ!

కుల పావనుడు నిజగురుడు రామస్వామి
చౌదరి కథ కృతి సల్పినావు
తన్మహనీయ నందనుని గోపీచందు
దివ్యగాథను తీర్చి దిద్దినావు
క్షమ నేటుకూరి వెంకట నరసయ సుచ
రిత్ర చిత్రముగ చిత్రించినావు
కర మరుదుగ హరిపురుషోత్తమ మనీషి
జీవిత చరిత రచించినావు

కవుల జీవిత కథలు చొక్కముగ వ్రాయ
జీవితము నంకితంబును జేసి తౌర
త్రిపురనేని కులాంబుధీం దీవరాప్త
సుగుణ సముదాయ కమనీయ సుబ్బరాయ!

శుభమగుతన్ ద్వత్సతికిన్
శుభమగుతన్ యుష్మ దాత్మజులకు సుతలకున్
శుభమగుత కళకు నీకున్
శుభమగుతన్ ద్రిపురనేని సుబ్బారాయా!

ఆంధ్ర వైయ్యాకరణ కేసరి మహాకవి శ్రీ చేబ్రోలు సుబ్రహ్మణ్య శర్మగారు యిట్లు ప్రశంసించినారు.

'గోపీచందు చరిత్రలోని పలుకుల్ గోశబ్ద సారంబుగా
రూపంబొంది వినూత్న భావ సరణిన్ రూపించి తత్వార్థమున్
స్థాపింపన్ గవి సుబ్బరాయుని మనీషాసిద్ధి సర్వార్థముల్
చూపంజాలుట యాంధ్రి పుణ్యమని తోచుంగాదె చర్చింపఁగా'

కనకాభిషేక, గజారోహణ, హస్త కంకణ, కవి గండ పెండేర సత్కారశాలి, శతావధాని శ్రీ సి. వి. సుబ్బన్నగారు నవ్యాంధ్ర కవిబ్రహ్మ ఏటుకూరి వేంకట నరసయ్యగారి జీవిత చరిత్రను చదివి ఇట్లు ప్రశంసించినారు.

"అక్షయ్యంబగు నేటుకూరి కవిచంద్రాభిఖ్య సామాన్యలో
కక్షోణిన్ నునుజిల్గు వెన్నెలలు జిల్కన్, దియ్యనౌ పల్కులన్
ద్రాక్షా పాకమునన్ రచించితివి, మోదంబయ్యె నీ గ్రంథమున్
వీక్షింపన్ సుకవిప్రియా! త్రిపురనేని ఖ్యాత వంశోదయా!"

"ఈ రచయిత శ్రీ త్రిపురనేని సుబ్బారావుగారు సౌమ్యభావము గల నిగర్వులు, భాషాప్రియులు, ఉచితానుచితజ్ఞులు. అభ్యుదయ భావాలు కలవారు. సుబ్బారావు గారికి కవిరాజు గారియందుగల గౌరవ మపారము. కవిరాజు గ్రంథము లన్నింటిని సవిమర్శముగా పఠించిన వారు. కవిరాజు జీవిత సాహిత్యముల సంగ్రహ స్వరూపమే మనకు లభించినది. దీనికి కారణము ఒకటయి ఉంటుందని అనుకొంటు న్నాను. సుబ్బారావుగారు వంశాభిమానంతో వ్రాశారని ఇతరులు అనుకుంటారేమో అన్న భావముతో తన రచనోద్రేకమును చాలా వఱకు నిరోధించుకొని ఉండవచ్చును".

"ఆంధ్రజాతికి, ఆంధ్ర సాహిత్యమునకు రామస్వామి చౌదరి చేసిన గొప్ప సేవకు తగినట్లు 'కవిరాజు జీవితం – సాహిత్యం' అను గ్రంథము ఆంధ్ర సరస్వతి కలంకారముగా నుండగలదని ఆశించు చున్నాను" అన్నారు ఆంధ్ర విశారద శ్రీ తాపీ ధర్మారావుగారు.

కథాసాహిత్య సమ్రాట్, సుప్రసిద్ధ నవలా రచయిత, తత్త్వ వేత్త శ్రీ త్రిపురనేని గోపీచంద్‌గారు "ఆంధ్రదేశంలోని అశేష పాఠ కులకు ఈ రచయిత సుపరిచితులు. మా నాన్నగారి ప్రియ శిష్యు లలో నొకరు. మన తెలుగు దేశంలో చక్కగా జీవిత చరిత్రలు వ్రాసేవారు బహుకొద్దిమంది. వారిలో యీ రచయిత అగ్రగణ్యులు. సాహితీరంగంలో ఈయన భవిష్యత్తు ఇంకా ఉజ్వలంగా ఉంటుం దనడంలో నాకు సందేహంలేదు'' అన్నారు.

సుప్రసిద్ధ న్యాయవాది, రచయిత శ్రీ ఆవుల గోపాలకృష్ణమూర్తి గారు "సాహిత్యరంగంలో నాలుగు కాలాలపాటు నిల్వగల్గిన రచనలు చేసిన వారిని వేళ్ళమీద లెక్కించవచ్చును. అందులో సుబ్బారావుగారు



మహారచయిత తత్వవేత్త శ్రీ గోపీచంద్
జీవిత చరిత్ర రచయిత శ్రీ సుబ్బారావు



ఆదర్శ దంపతులు :
శ్రీ సుబ్బారావుగారు, శ్రీమతి జయప్రదాదేవిగారు



సుబ్బారావుగారి
కుమార్తె నిర్మలాదేవి
కుమారుడు జయదేవ్



త్రిపురనేని సోదరులు
చి॥ శ్రీనివాస్
చి॥ జయదేవ్

ఒకరు. కవిరాజు, గోపీచంద్, కవిబ్రహ్మల జీవిత చరిత్రలు ఆధునికాంధ్ర సాహిత్య సాగరంలో ఆణిముత్యాలు" అన్నారు.

కళాప్రపూర్ణ, మహాకవి, పద్మశ్రీ బోయిభీమన్నగారు "మీరు పట్టిందెల్లా బంగారం, వ్రాసిందెల్లా సాహిత్యం. ఇది మీకు జన్మతో వచ్చిన వరం" అన్నారు.

అష్టావధాని హరి పురుషోత్తంగారు యిట్లు ప్రశంసించినారు.

"గురుఁడగు రామస్వామి కనుగోరహియింపఁడు పంచ కావ్యముల్
గఱచుట గొప్పసంగతియుఁ గాదయె భక్త్యనురాగ పూర్ణత
త్వరమతి సుబ్బరావు గణితంబు నెఱుంగడు రేఖగఖ్య సు
స్థిరతఁ దపించి నిల్పె గురుదేవుని నవ్యయ కావ్య పీఠికన్"

జస్టిస్ ఆవుల సాంబశివరావుగారు "త్రిపురనేని రామస్వామిగారు రచయితలలో కవిరాజు. మనుషులలో మహామనీషి. రచనలలో తెలుగునకు, తెలుగుదనానికి, తెలుగు నుడికారానికి ప్రాధాన్యత నిచ్చిన సిసలైన తెలుగుకవి. ఆంధ్ర సాహిత్యంలో హేతువాద దృక్పథాన్ని ఆవిష్కరించిన మార్గదర్శి. భారత సాంస్కృతిక చరిత్రకు నూతన నిర్వచనాన్ని నెలకొల్పిన భావుకుడు. ఆయన పండితుడు, తార్కికుడు, తాత్త్వికుడు. గద్యంలోనూ, పద్యంలోనూ అసమానశక్తి సంపదలతో రచన గావించిన సవ్యసాచి. ఇట్టి మహా మనీషి, ఇట్టి మహాకవి జీవిత చిత్రణ, సాహిత్యకృషిసమీక్ష ఆంధ్రదేశానికే కాదు,

భారత దేశానికే ఎంతో అవసరం. తన కథావస్తువుమీద సుబ్బారావు గారు ఎంతగానో కృషిచేశారు. ఆ కృషి ఫలితమే 'కవిరాజు జీవితం – సాహిత్యం' అనే చక్కని రూపకల్పన" అన్నారు.

కాటూరి వేంకటేశ్వరరావుగారు "కవిరాజు, గోపీచంద్, జీవిత చరిత్రలు ఆంధ్ర సాహిత్య నందనోద్యానము నందలి సురభిళ ప్రసూన ములు" అన్నారు.

"గంభీర భావాల గదలించి కవిరాజు
జీవితగాథ రచించినాడు
అమృతంబు జిలికించి యాంధ్రాభ్యుదయమును
ప్రేమపాకాన చిత్రించినాడు
ఏటుకూరి నర్సకవీంద్రుని కవితా చ
రిత్రను తీర్చి పూరించినాడు.
కురువింద మణులను గూర్చి గోపీచందు
వజ్రాల చరితను వ్రాసినాడు.

అక్షరాక్షరమందున నారిపోని
తెలుగుదనము ప్రదర్శించి విలువగలుగు
వ్యాసములనెన్నొ వ్రాసి వ్యాప్తంబు జేసి
తెలుగుభారతి ఋణమును దీర్చినాడు.

—కవిశేఖర జి. జోనఫ్ కవి.

"మిత్రులు త్రిపురనేని సుబ్బారావుగారు పూజ్యులు హరి పురు షోత్తమ కవిగారి జీవితమును చిత్రించిన గ్రంథము చదివితిని. జీవిత చరిత్ర రచనకూడా ఒక విశిష్టమైన సాహిత్య ప్రక్రియ, యనియూ,

దానిని నిర్వహించుటకు విలక్షణమైన ప్రతిభ అవసరమనియు, మిత్రులు సుబ్బారావుగారు అట్టి ప్రతిభ పుష్కలముగా కలవారనియు, ఈ గ్రంథమువల్ల నాకు గాఢమైన విశ్వాసము కుదిరినది" అన్నారు డాక్టర్ పాటిబండ మాధవశర్మగారు.

*"హరిపురుషోత్తంగారి వ్యక్తిత్వాన్ని, రచనల వైశిష్ట్యాన్ని, శ్రీ సుబ్బారావుగారు చక్కగా వివరించారు. 'కవిరాజు జీవితం - సాహిత్యం', మహారచయిత గోపీచంద్ జీవిత చరిత్ర రచించిన శ్రీ సుబ్బారావుగారి శైలి ప్రస్తుత రచనలో మరింత పదునైనది" అన్నారు శ్రీ కె. దేశపతిరావుగారు.

కవిబ్రహ్మ జీవిత చరిత్రను చదివిన డాక్టర్ తంగిరాల నారాయణశాస్త్రిగారు "కవిబ్రహ్మ కావ్యోద్యానమునందలి విచిత్రభావ పుష్పము లేర్చికూర్చి నిత్య శోభతో నెనలార్చి దెసలు వెలిగించు పూలపందిరి కట్టినవారు శ్రీ సుబ్బారావుగారు. సదమల ప్రేమభావములను, చారిత్రక విజ్ఞాన సంస్కృతులను విప్పిచెప్పు నీ సాహిత్య రచనము సర్వాంధ్ర స్వాంతముల సౌరభము నింపుజాజి పూచెండు వంటిది" అన్నారు.

'నవ్యాంధ్ర కవిబ్రహ్మ జీవితం - సాహిత్యం' చదివిన శ్రీ లింగం వీరభద్రయ్యగారు (బారిష్టరు) "కవుల జీవితములను, వారి రచనలను, పాండిత్య ప్రకర్షతో, సునిశిత దృష్టితో పరిశీలించి, ఉత్తమ స్థాయిని వ్యాఖ్యానించటంలో మీరు సిద్ధహస్తులు. కవిబ్రహ్మకు మీరు

*నాట్యకళ

పూజా కుసుమాలను సమర్పించి, వాటి సుగంధాన్ని ఆంధ్ర సాహిత్య లోకానికి ప్రసారం చేసినందులకు మీకు నా ధన్యవాదాలు" అన్నారు.

సుప్రసిద్ధ వచన గేయకవి, సోవియట్ ల్యాండ్ నెహ్రూ అవార్డు విజేత శ్రీ కుందుర్తి ఆంజనేయులుగారు "మరుగుపడిన మాణిక్యమైన శ్రీ పురుషోత్తంగారిని పలువురికి పరిచయం చేసి, వారి జీవిత చరిత్రను సమగ్రముగా వ్రాసి మన కందించిన మిత్రులు శ్రీ త్రిపురనేని సుబ్బా రావుగారి కృషి శ్లాఘనీయము. జీవిత చరిత్రలు వ్రాయుటకై శ్రమపడి, యధార్థ విషయములను సేకరించుటలోను వాటిని సర్వజనా మోదకరమైన శైలిలో అందించుటలోనూ శ్రీ సుబ్బారావుగారు సిద్ధ హస్తులు" అన్నారు.

నవయుగ కవిచక్రవర్తి, కళాప్రపూర్ణ శ్రీ గుఱ్ఱం జాషువాగారు ఇలా ప్రశంసించినారు.

"కావ్యరచన వేరు; గద్యరచన వేరు
తనర ప్రముఖ జీవితముల గూర్చి
వ్రాయు ధిషణ సుబ్బరాయని కమరెను
ఆంధ్ర బాస్వెలీతడనుట యొప్పు."

"కవిరాజు జీవితం - సాహిత్యం" రామస్వామి చౌదరిగారిని గూర్చి తెలుసుకొనగోరు వారవశ్యము పఠించవలసిన గ్రంథము"

—భారతి.



కవిబ్రహ్మ ఏటుకూరి వెంకట నరసయ్యగారు



మిత్రవర్యులు శ్రీ ఆవుల గోపాల కృష్ణమూర్తిగారు



పోతుకూచి పాతికేళ్ళ సాహితీ కృషి అభినందన సభలో ముఖ్యవక్త శ్రీ సుబ్బారావుగారు, తదితర సాహితీ మిత్రులు కుమారి జ్యోతిర్మయి, శ్రీ వసంతరావు వెంకటరావు, శ్రీ పోతుకూచి సాంబశివరావు, శ్రీ ఏ. చక్రపాణి, శ్రీధర్, శ్రీ ముకురాల రామారెడ్డి, శ్రీ కావూరు సత్యనారాయణ, శ్రీ త్రిపురనేని సుబ్బారావు, విద్వాన్ టి.యస్.ఆర్. అప్పారావు, శ్రీ అద్దంకి కుటుంబరావు, శ్రీ వడ్లపల్లి సత్యం.

శ్రీమదాచార్య రఘునాథ చక్రవర్తిగారు గోపీచంద్ జీవిత చరిత్రను పఠించి ఇట్లు ప్రశంసించినారు.

"పాండిత్యంబున ఖండనంబునను వ్యుత్పాద్యాఖ్య గోత్రంబు మా
ర్తాండేంద్వన్వయ తుల్యమా త్రిపుర నేన్యాఖ్యాక వంశాబ్ధికిన్
నిండుం జంద్రుఁడు సుబ్బరావు దయ మొందెన్ పట్టభద్రుండు ధీ
శౌండుండాయన వ్రాసె సీకృతి నమ స్తాంధ్ర ప్రజాప్రీతికై".

కవితా విశారద శ్రీ యం. వి. బి. మూర్తిగారు ఇట్లు ప్రశంసించారు.

"చిత్రములు రంజిలు నటుల చెప్పినావు
పుణ్యపురుషుల జీవితాల్ పూర్ణమతిని
పొత్తములుకూర్చి నత్తుగా నెత్తినావు
రత్నములకు విలువకట్టు యత్నమందు"

"శ్రీ గోపీచంద్ జీవిత చరిత్రను చదివితిని. మీ సునిశిత విమర్శకు, రసదృష్టికి, తాత్త్విక సమాలోచనకు ఎంతో ముగ్ధుడనైతిని. ఇంత మంచి రచన చేసినందులకు మీ కభినందనలు" అన్నారు విద్యా విశారద శ్రీ కె. టి. ఎల్. నరసింహాచార్యులుగారు.

ప్రఖ్యాత రచయిత శ్రీ పన్యాల రంగనాథరావుగారు "ఇంకొకరి జీవిత చరిత్ర రాయ సమకట్టడం, కత్తిమీద సాముకీ, నిప్పులమీద నడకకీ సిద్ధం కావడంలాంటిది. ఇటువంటి ప్రాణాంతకమైన పనులు తలపెట్టేవారు, నూటికీ, కోటికీ, జాన్సన్‌వంటి వాళ్ళకు ఒక బాస్వెల్

ఉంటాడు. రామస్వామి చౌదరిగారూ, ఏటుకూరివారూ, హరి పురుషోత్తంగారూ, గోపీచంద్‌వంటి అనేక మంది దిగ్గజాలనదగ్గ వాళ్ళందరికీ కలిపి వాక సుబ్బారావుగారున్నారు.

శ్రీ త్రిపురనేని సుబ్బారావుగారు అన్ని విధాలా గడుసరి. గడుసరి గనకనే సాహిత్యంలో ఇంకెవ్వరికీ సులభంగా కొరుకుపడని ప్రత్యేక ప్రక్రియ ఎన్నుకుని, దానికి అంటుకునిఉన్న కత్తులమీద, వాటితోపాటేఉన్న నిప్పులమీద నడక సాగించారు. నిరాఘటంగా సాగిస్తున్నారు.

జీవిత చరిత్రలో, వాస్తవానికి ఎక్కువ ప్రాముఖ్యం ఉంటుంది. కల్పనకన్న వాస్తవాన్ని రాయడంలోగల ఇబ్బందీ, కష్టం, చిక్కులూ, జీవిత చరిత్ర రచయితకు తెలిసినంతగా ఇతరులకు తెలీదు. అందరూ తెలుసుకోదగ్గవీ, తెలుసుకొనితీరవలసినవీ, తెలుసుకో నవసరం లేనివీ, తెలుసుకోకూడనివీ అనేకం ఉంటాయి. వీటిని వేరు చేయడంలోనే ఉంది బాస్వెల్, శ్రీ సుబ్బారావుల నిక్కు. ఇదొక ఎత్తు.

జీవిత చరిత్ర రాయటానికి తగిన భాషా పరిజ్ఞానం కావాలి. కాల్పనిక సాహిత్యంలో ఏం రాసినా చెల్లు పెట్టుకోవచ్చు. జీవితచరిత్ర రచనలో ఈ వప్పు ఉడకదు. ఇది ఇంకో ఎత్తు.

ఈ రెండూకూడా సాధించుకొచ్చి, తనకుతానై ఒక ప్రత్యేక స్థానం సంపాదించుకున్నాడు త్రిపురనేని సుబ్బారావుగారు'' అన్నారు.

సుప్రసిద్ధ కథారచయిత, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతి గ్రహీత శ్రీ రావూరి భరద్వాజగారు "కవిరాజు రామస్వామి చౌదరిగారిని గురించి 18 మాసాలుగా 'స్రవంతి' పత్రికలో వెలువడిన సుబ్బారావుగారి వ్యాసాలు చదివాను. ప్రభుత్వోద్యోగంలోనూవిరి సలుపని పనులలో మునిగియుండికూడా ఇంతటి విస్తృతమైన పరిశోధ నను వీరెలా చేయగలిగారో తెలియదు. ఈ వ్యాసాలు చదివిందాకా, కవిరాజుగారిపట్ల సమకాలీనులు వెలిబుచ్చిన అభిప్రాయాలేమిటో నా మట్టుకునాకు తెలియదు. వివిధ పత్రికలలోనూ, వివిధ సందర్భాల లోనూ, పెద్దలు వెలుబుచ్చిన అభిప్రాయాలన్నింటినీ జాగ్రత్తగా, ఓపి కతో సేకరించడమన్నది మాటలతో అయ్యే పనికాదు. ఆ అభిప్రా యాలను తగిన స్థలాలలో పొందుపరచడమన్నది సుబ్బారావుగారి రచనా శిల్పానికొక ఉదహరణ" అన్నారు.

"సరళ పదాంచితమై, రస
భరితంబై, మధుర భావ పరిమళయుతమై
సురుచిరమై, నీరచనలు
విరియునయా! సుబ్బరాయ! విబుధ విధేయా!"

—'రసప్రియ' పోతేదార్ కేశవాచార్య.

గోలకొండ పత్రిక సహాయ సంపాదకులు శ్రీ సి. హెచ్. ఆచార్యగారు "సుబ్బారావుగారిని చూచినప్పుడల్లా నాకు భగీరథుడు జ్ఞాపకం వస్తూఉంటాడు. తన వారికి ఉత్తమలోకప్రాప్తి కలిగించ డంకోసం భగీరథుడు తపస్సుచేసి, గంగను దివినుండి భువికి అవత రింపజేశాడు. అదే విధంగా సుబ్బారావుగారుకూడా మౌలికమైన కృషి చేసి 'కవిరాజు, గోపీచంద్' జీవిత సాహిత్యాలలోని రసవద్ఘట్టాలను

తెలుగు వారికి చవి చూపించారు. సుబ్బారావుగారొక వ్యక్తి కాదు. ఆయన ఒక సంస్థ. లేదా ఒక ఉద్యమం అనడం సమంజసం" అన్నారు.

శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు "త్రిపురనేని వారిది పండిత వంశము. శ్రీ సుబ్బారావుగారు సుప్రసిద్ధ రచయిత. ఎంతటి క్లిష్టమైన విషయమునైననూ అరటిపండు వొలిచి చేతిలో పెట్టినట్లు చేయగల నేర్పు గలవారు. మహాకవుల జీవిత చరిత్రలు వ్రాయుటలో వారు సిద్ధహస్తులు. ఈ సాహిత్య ప్రక్రియలోనే వారు ఆచంద్ర తారార్కమైన యశస్సు నార్జించగలరని నేను ఆశించుచున్నాను".

డాక్టర్ ఆరిపిరాల విశ్వంగారు "కవులుగా చలామణీ అయేందుకు ఉబలాటపడే ఈ రోజులలో విమర్శకులుగా సారస్వతరంగంలో నిలుద్దామని అనుకోటానికి తగిన ఆత్మశక్తి మిత్రులు సుబ్బారావుగారిలో ఉన్నది" అన్నారు.

"I have cursorily passed over the pages of your biography on late Gopichand. You have really done it well with the tears of a cousin, with the dispassion of a critic and with the falicity of a seasoned writer of prolific prose works. It is most humanistic and touching the heart strings of the reader"

— **P. Dhananjaya Rao,**
*Dy. Collector (Retd).*



మహాకవి, ఉభయభాషా కవితా విశారద, ఆంధ్ర వైయాకరణ కేసరి,
శ్రీ చేబ్రోలు సుబ్రహ్మణ్య శర్మగారు 'సరస్వతీ విహారము'లో
శ్రీ సుబ్బారావుగారిని సన్మానించినప్పటి ఛాయాచిత్రం



హైదరాబాదులో జరిగిన సన్మానసభలో మహాకవి, కళాప్రపూర్ణ, పద్మశ్రీ బోయి భీమన్నగారు సుబ్బారావుగారిని పండిత శాలువతో సత్కరిస్తున్న చిత్రం

శ్రీ జి. రామకృష్ణ, డిప్యూటీ ట్రాన్స్‌లేటర్ "గోపీచంద్ జీవిత చరిత్ర అందమైన ఒక డాక్యుమెంటరీ చిత్రంలా సాగిపోతున్నది" అన్నారు.

ఆకాశవాణి గ్రామస్థుల కార్యక్రమాల ప్రయోక్త శ్రీ ఎన్. వి. ఎస్. ప్రసాదరావుగారు "రైతుగా పుట్టి, రైతుగా పెరిగిన, రైతు కవి నవ్యాంధ్ర కవిబ్రహ్మ ఏటుకూరి వెంకట నర్సయ్యగారి జీవిత చరిత్రను రమ్యంగా రచించిన రచయిత త్రిపురనేని సుబ్బారావుగారికి నివాళులర్పిస్తున్నాను" అన్నారు.

దర్శనాచార్య, కళాప్రపూర్ణ శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు గారు "కవిబ్రహ్మ వెంకటనరసయ్యగారి సాహిత్యాన్ని మధించి, అందులోని మేలిమిని, మెరుగులను ఎత్తిచూపడం తేలిక పనికాదు. సాహసమైన ఇలాంటి మంచి పనికి పూనుకొని సుబ్బారావుగారు కృతకృత్యులైనారు. ఇలాంటి అత్యుత్తమ గ్రంథాన్ని అచ్చువేసే అవకాశం కల్పించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకూడాఅభినందనార్హమే" అన్నారు.

శ్రీ ఆచంట జానకిరామ్‌గారు "శ్రీరామస్వామిగారి ప్రియశిష్యులలో నొకరైన శ్రీ త్రిపురనేని సుబ్బారావుగారు భక్తితో చేసిన కృషి ఫలితమే ఈ కవిరాజు సాహిత్య విమర్శ" అన్నారు.

కవి పరమహంస, శ్రీ మీగడ నరసింహారెడ్డిగారు సుబ్బారావుగారి కృతులను చదివి యిట్లు ప్రశంసించినారు.

"భువనస్తుత్య చరిత్రులైన సుకవుల్ పొల్పొందగా వ్రాయు గ్రం
థ విశేషమ్ముల సేకరించి గుణముస్ తర్కించి శోధించి చ
క్క విమర్శించుచు గ్రంథముల్ల్నెలవు సంఖ్యావంతులున్నారె? తం
ద్రి! విచారింప భవత్సముల్! త్రిపురనేన్ శ్రీ సుబ్బరాయా! సుధీ!"

తెలుగు లెంక, కళాప్రపూర్ణ శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారు సుబ్బారావుగారినిట్లు దీవించినారు.

"శ్రీ సుబ్బరాయ ! మహిత
వ్యాసంగము నీది, నీ ప్రయత్నములెల్లన్
వాసిలు సఫలం, దాశశి
భానంతము నీయశమ్ము ప్రబ్బు జగానన్"

దశభాషా విశారద విద్యా వాచస్పతి శ్రీ గుండేరావు హర్కారే సంస్కృతంలో ఇట్లు ప్రశంసించినారు.

"విద్వద్వరః త్రిపురనేని కులాబ్ధి చంద్రః
జ్యోత్స్నాం కిరత్యభి నవాం భువి సుబ్బరాయః
నచ్ఛాత కైరు పస్నృతః పరితః సదావాక్
పీయూష బద్ధ కబలైః పద తత్వవిద్భిః

+'కవిరాజు మరణించిన ఇరవై ఏండ్లకయినా వారి జీవిత చరిత్ర వెలువడడం ముదావహం'.

*"ఒక మహోద్యమానికి నాందీవాచకం పలికిన కవిరాజుగారి జీవిత - సాహిత్యాలను గురించి, వివరణాత్మకంగా చిత్రించిన తొట్ట తొలిగ్రంథం ఇది. ఈ గ్రంథకర్త శ్రీ త్రిపురనేని సుబ్బారావుగారు ఆంధ్రదేశానికి చిరపరిచితులు. కవిరాజుగారి జీవిత చరిత్రను వ్రాయ డంలో వారు చాలా శ్రమదమాదులకులోను కావలసివచ్చింది. కవిరాజు గారి స్నేహితులను, సమకాలీనులను కలిసికొని, ఎన్నో విషయాలను,

---

+ ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రిక 27–1–65.

* శిల్పశ్రీ 12–1–65

ఇంత వరకు తెలుగు పాఠకులకు తెలియనివాటిని సేకరించి వీరి గ్రంథములో పొందుపఱచినారు ప్రతివారూ తప్పక చదువవలసిన గ్రంథమిది".

అభ్యుదయ ప్రజాకవి గులాం యాసిన్ 'త్రిపురనేని' వారిని గురించి ఇట్లు ప్రశంసించినారు.

"మూఢ విశ్వాసాల మూల్గెడి
మొఱటుతనమును కరడుగట్టిన
మౌఢ్య జాడ్యము ప్రబలినప్పుడు
మందు లిచ్చిన మహావైద్యులు
త్రిపురనేని పయోధి చంద్రులు.

అరువు తెలివితో అఱ్ఱులె త్తెడి
దురాచారుల దుర్విదగ్ధత
ఏపు రూపణగార్చి తెలుగుల
జాతినీతుల నిలిపినారలు
త్రిపురనేని పయోధి చంద్రులు.

అభిజాత్యపు టహంకారము
నణగద్రొక్కిన యమర వీరులు,
సర్వ మానవ జాతి సేవకు
సర్వ మర్పించిన ఉదారులు
త్రిపురనేని పయోధి చంద్రులు.

నీతి ధర్మము సద్వివేచన
హేతువాదము నల్పిరదిగో!
తెలుగు దేశపు నలు చెఱంగుల
వెలుగు జిమ్మిన ధీరులహాహో!!

ఆర్షకవిభూషణ శ్రీ వద్దవల్లి సత్యం జీవిత చరిత్రల రచనలో సుబ్బారావుగారికిగల ప్రతిభకు జోహారు లర్పించినారు.

"త్రిపురనేని తిలకుడు
సుబ్బరాయ నామధేయుడు
సర్వ బుధజనములు
మెచ్చురీతి వెల్గుచూపు
జాతి రత్నములను
జీవిత చరిత్రలను
మేలిమిపొత్తపుటుంగరముల
పొందుపరచి వుంచెను
కలకాలము వెల్గునటుల
ఓ త్రిపురనేని తిలకమా,
మనసా, వాచా, కర్మణా
సుందర ప్రకాశమా,
త్రికరణ శుద్ధిని గన్న
యమునా గంగా
పవిత్ర సంగమమా,
జీవిత సాహితీ
వైభవ శ్రీగంధమా!
ప్రేమ పురస్సరముగ
అందుకొనుము
నాదు హృదయ
పూర్వక భక్తి
సుమాంజలులు

ఆంధ్రావనిలో
దివ్య చరితుల
చరితలు ఇంకా
పదునైన నీ లేఖిని
వెలయించాలి
అందుకే అందుకో
మరొక్క మారు
నా జోహరు! "

బౌద్ధ వాఙ్మయ బ్రహ్మ శ్రీ దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు "మీ హృదయమెంత సున్నితముగ నున్నదో, మీ రచన అంత మధుర మనోజ్ఞ, మంజులముగ నున్నది" అన్నారు.

## కృతిపతి

శ్రీ సుబ్బారావుగారు కృతికర్తయేగాక, కృతిభర్త కూడా. నిస్వార్థము, నిష్కళంకమునైన వారి వ్యక్తిత్వమునకు, అమేయమైన వారి పరిశోధనాశక్తికి, నివాళులర్పించుచు, సుప్రసిద్ధ కథా రచయిత శ్రీ రావూరి భరద్వాజగారు తాము రచించిన 'వినువీధిలో వింతలు' అను భగోళశాస్త్ర గ్రంథమును శ్రీ త్రిపురనేని సుబ్బారావుగారికి 'కానుక'గా సమర్పించినారు.

మహాకవి శేఖర, శతావధాని, చిత్రకవితా ప్రవీణ, కవిసింహ, మాజీ గద్వాల ఆస్థాన కవి, బ్రహ్మశ్రీ పోకూరి కాశీపతిగారు రచించిన

"శ్రీశైల మల్లేశ్వర శతకము"ను సుబ్బారావు గారికి కృతి నొసంగి నారు. ఆ శతకము నందలి ఈ మూడు పద్యములను తిలకించండి.

ప్రమదం బుప్పతిలంగ భాగ్యనగరీ వాసున్ భవద్భక్తు వీ
రమకున్ వీరయ కగ్రనందను గృపారత్నాకరున్ సద్గుణ
స్తిమితున్ భవ్యచరిత్రునిన్ త్రిపురనేన్ శ్రీ సుబ్బరాయాఖ్యుఁబే
రిమి దల్కొత్తఁగ నెప్పుడేలఁగదవే శ్రీశైల మల్లేశ్వరా।

అకలంకాత్ము జయప్రదావిభుని నమ్యక్కీర్తికామున్ విమ
ర్శక రత్నాంక మనోజ్ఞ సద్బిరుద సంప్రాప్తున్ గృపాలోలు భూ
రి కవిత్వ ప్రియుఁ బ్రాజ్ఞునిన్ ద్రిపురనేన్ శ్రీ సుబ్బారాయాఖ్య ధా
ర్మిక వర్యున్ సతతంబుఁ బ్రోవఁగదవే శ్రీశైల మల్లేశ్వరా।

క్షితి నొప్పారెడు సప్త సంతతులలోఁ జెల్వొందఁగాముఖ్య సం
తతులౌ నాన్ వరపుత్రులన్ గనియెఁ బ్రోద్యత్ప్రీతి నాచేత నీ
కృతి నొందెన్ ఘనుఁడౌను పో త్రిపురనేన్ శ్రీ సుబ్బరావున్ సమం
చిత కారుణ్యము తోడ నేలఁగదవే శ్రీశైల మల్లేశ్వరా।

## బిరుదు ప్రధానం

త్రిపురనేని సుబ్బారావుగారు రచించిన మహా మనీషుల జీవిత, సాహితీ చరిత్రలను ఆమూలాగ్రముగా పరిశీలించి, వీరి రచనా శిల్ప వైదుష్యమును బ్రహ్మశ్రీ కాశీవత్యవధానులుగారు గుర్తించినారు. నాగార్జున సాహితీ సమాఖ్య (మాచెర్ల) పక్షమున, దాని అధ్యక్షులైన కవి సింహ కాశీవత్యవధానులుగారు శ్రీ త్రిపురనేని సుబ్బారావు గారికి

"విమర్శక రత్న" యను బిరుదమును సాధారణనామ సంవత్సర కార్తీక శుద్ధ పాడ్యమీ శనివారం రోజున (31-10-1970) ప్రదానము గావించి, సగౌరవముగా సన్మానించినారు. ఈ సందర్భమున +"జీవిత చరిత్ర రచనలో సిద్ధహస్తులు శ్రీ సుబ్బారావుగారు". *"Profile of a Biographer" అను వ్యాసములు దిన పత్రికలలో ప్రచురింప బడినవి. ఆంధ్రదేశంలో అనేకచోట్ల శ్రీ సుబ్బారావు గారికి వేదోక్తముగా సన్మానములు జరిగినవి. కాశ్మీరు శాలువలతో సత్కరించ బడినారు.

వాఙ్మయ సేవా పరాయణులు, మధుర మనోజ్ఞ కవితా పిపాసువులు, భవ్య విమర్శకులునగు సుబ్బారావుగారు ఆయురారోగ్య సకల సౌభాగ్య సంపత్తులతో వర్థిల్లి, ఆంధ్ర సారస్వతమునకు ఇతోధిక సేవ చేయుచు, కారణ జన్ములుగా, కృతార్థులగుదురు గాక!



---

+ ఆంధ్రభూమి. ఆదివారం 20-12-1970

* The Deccan Chronicle – 5th May 1971